# ప్రార్థన

శ్లో॥ వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే
జగతఃపితరౌ వందేపార్వతీ పరమేశ్వరౌ.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుంశశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.

శ్లో॥ మాణిక్య వీణాముపలాలయంతీంమదాలసాంమంజుల వాగ్విలాసామ్.
మహేంద్రనీలద్యుతికోమలాంగీం మాతంగ కన్యాం మనసాస్మరామి

శ్లో॥ చతుర్భుజే! చంద్రకళావతంసే! కుచోన్నతే! కుంకుమరాగశోణే !
పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణహస్తే! నమస్తే! జగదేకమాతః !

మ॥ తల్లీ! నిన్నుదలంచి పుస్తకముచే తంబూనితిన్ నీవు నా
యుల్లంబందుననిల్చి జృంభణముగానుక్తుల్ సుశబ్దంబుశో
భిల్లంబల్కుము నాదువాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ !
ఫుల్లాబ్జాక్షీ ! సరస్వతీ ! భగవతీ ! పూర్ణేందుబింబాననా !

మ॥ శాంతాకారంభుజ గశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారంగగన సదృశం మేఘవర్ణం శుభాంగమ్
లక్ష్మీకాంతం కమలనయనంయోగి హృద్ధ్యానగమ్యం
వందే విష్ణుంభవభయహరం సర్వలోకైక నాథమ్.

మ॥ కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షః స్థలేకౌస్తుభం
నాసాగ్రేనవమౌక్తికం కరతలే వేణుం కరేకంకణం
సర్వాంగేహరి చందనం చకలయన్ కంఠేచముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టతో విజయతే గోపాలచూడామణిః

# భద్రాద్రి
# సీతారాముల కళ్యాణము



రచన

"భాషా ప్రవీణ"


## సాదినేని రంగారావు (M. A.)

గొట్టిపాడు (P. O.)

ప్రత్తిపాడు తాలూకా, గుంటూరు జిల్లా.


వెల రూ. 4 - 00

ప్రథమ ముద్రణ : మే 1973. ప్రతులు 1000.
ద్వితీయ ముద్రణ : అక్టోబరు 1975. ప్రతులు 1000.
తృతీయ ముద్రణ : ఏప్రియల్ 1983. ప్రతులు 1000.


వలయువారు :—

**సాదినేని రంగారావు (M. A.)**
అన్నపూర్ణ భవనము
డోర్ నెం. 2 - 28 - 19
దేవినేని వెంకయ్య వీధి
గాంధీనగర్, **తెనాలి**

ముద్రణ :
కాళిదాస్ ఆర్ట్ ప్రెస్, తెనాలి.

## : పండితాభిప్రాయము :

గ్రంధకర్త శ్రీ సాదినేని రంగారావుగారు "భద్రాద్రి సీతారాముల కళ్యాణ" మను నామముతో సీతారాముల గాథలను సామాన్యజనులకు అందుబాటులో నుండి, చదివి ఆనందించుటకు అనుగుణముగా వ్రాయుట ప్రశంసనీయము. తమ్మెర దమ్మక్క సీతారాములను సామాన్యకుటీరములో నిత్యము ఆరాధించుట, భక్త రామదాసుగారు ఆలయ ప్రాకారములో సీతా రామ లక్ష్మణులకు ఆభరణములను చేయించుట, దీనికిగాను ప్రభుత్వ ధనమును వ్యయపరచి, కఠినకారాగార బాధలననుభవించుట మున్నగు ఎక్కు కష్టముల ననుభవించి, త్యాగియై భద్రాచలమునకును, తనకును చిరప్రతిష్ట నార్జించుకొన్న మహాభక్తుడు. ఇట్టి పుస్తకమునగల విషయములు పాఠకులను సంతృప్తిపరచి ఆనందము నందింపనుగాక!

గుంటూరు 1-5-1973 కల్లూరి చంద్రమౌళి

## : కవిశేఖరుల ఆశీస్సులు :

ఆ. వె. సాదినేనివంశ జలధి పూర్ణశశాంక
రంగరాయ! నీకు మంగళంబు
భద్రశిఖరి నేలు ప్రభుల కళ్యాణంబుఁ
గంటిఁ దావకంబుఁగంటి ముదము

కం. ఆద్యతనులు మది మెచ్చన్
హృద్యకవిత నీదుజిహ్వ నృత్యము సేయన్
విద్యావంతుఁడవై యన
వద్య యశము దెసల వెలయ వరలుము కవివై.

గుంటూరు
30-8-1973

ఇట్లు
కవిశేఖర మధ్వ శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు

## ఆల్ ఇండియా బ్రాడ్‌కాస్ట్ ప్రత్యక్షవ్యాఖ్యాతాభిప్రాయము

ప్రతిసంవత్సరము భద్రాద్రి సీతారాముల కళ్యాణమహోత్సవ విశేష ములను నేను ప్రసారం చేస్తున్నప్పుడు నామాటలు నేను వినలేకపోయాను. ఆ పారవశ్యములో నేనేమి చెప్పానో నాకు గుర్తుండదు. చాలమంది వినియున్నారు. ఈ సాదినేని విని సర్వవిషయములు సమగ్రముగ వ్రాసి నారు. ఈపుస్తకం చదివిన భద్రాద్రి వెళ్ళి సీతారాముల కళ్యాణము చూచి వచ్చినట్లగుతుంది,

ఈపుస్తకమును నేను హృదయపూర్వకంగా మెచ్చుకొంటున్నాను. కళ్ళుపెట్టుకొని చూచినవారికి అక్కడి దృశ్యము ఎట్లాకనబడుతుందో, చెవులతో వినినవారికి కూడ అట్లే కనబడవలయున ని సాదినేని భావించి ఉంటారు. ఈయన సుగ్రీవుడయితే అనుకొన్నపని అవుతుంది, ఈ పుస్త కము ప్రతిసంవత్సరము అమ్ముపడి ప్రతి పందిట్లోను తిరిగి సాదినేని కింత ప్రసాదం కలిగిస్తే అది శ్రీరామప్రసాదం అవుతుంది. అస్తు.

గుంటూరు ప్రమాది వైశాఖారంభము. జమ్మలమడక మాధవరాయశర్మ

## సుప్రసిద్ధ రామభక్తులు, సాధుగురువుల అభిప్రాయము

మీరు నా లేఖ ననుసరించి పంపబడిన "సీతారామ కళ్యాణము" అను పుస్తకము అందినది ఇదొక క్రొత్త రచన. ఉన్నది వున్నట్లు, ప్రత్యక్ష ముగా మనముకూడ అక్కడే వున్నరీతిలో రచన జరిగినది, మీరు చాల ధన్యులు. చాల మంచిపని పూర్తిచేసినారు. నేను భద్రాద్రి సీతారాముల కళ్యాణము చూచివచ్చినవాడిని. మీరు వ్రాసినది సరిగా వున్నది. ఒక్క పొల్లులేదు? శాశ్వతమైన పని కళ్ళకుకట్టినట్లు చెప్పి రచించిరి. ధన్యులు. నమస్కారములు.

మద్రాసు 27-9-1972 యం. రామచంద్ర అప్పారావు

## : కృ త జ్ఞ త :

ఇందు వారివారి అమూల్యాభిప్రాయములు వ్రాసిన మాజీ రెవిన్యూ & దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులగు పూజ్యశ్రీ కల్లూరి చంద్రమౌళిగారికి, ప్రసిద్ధ ఆల్ ఇండియా బ్రాడ్ కాస్ట్ ప్రత్యక్ష వ్యాఖ్యాత మాన్యశ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారికిని, కవిశేఖర శ్రీ పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్యులుగారికిని, సుప్రసిద్ధ శ్రీరామ భక్తులు సాధుగురువులగు యం. రామచంద్ర అప్పారావు గారికిని నా కృతజ్ఞతాభివందనములు.

దీనిలో గోదావరి చరిత్ర. భద్రుని గాథ, తమ్మల దమ్మక్క, రామదాసు, పెరుమాళ్ళయ్య మొదలగు మహాభక్తుల గాథలు కలవు. ఇంకను అక్కడ విశేషము లన్నియును, శిల్ప, చిత్ర, కళానైపుణ్య మంతయు ఇందు వ్రాయబడినది. ఇందువలన ఈపుస్తకము చదివినను, వినినను మీరు ఆ భద్రాద్రి వెళ్ళి సీతారాముల కళ్యాణము, అక్కడ విశేషము లన్నియు చూచినట్లే యగును.

నేను మాన్యశ్రీ శర్మగారి ప్రత్యక్షవ్యాఖ్యానము ప్రతిసంవత్సరము విని తన్మయుడ నగుచుండెడివాడను. ఆ ప్రత్యక్షవ్యాఖ్యానము విన్నప్పుడు నాకు ఆ భద్రాద్రి సీతారాముల కళ్యాణము నా కనుల ఎదుట జరుగుచున్నట్లుగా కన్పించెడిది. అటులనే నేనును కళ్యాణము ప్రత్యక్షముగా కనుల ఎదుట జరుగుచున్నట్లుగా వ్రాయ దలచితిని. కాని ఈనాప్రయత్నములో ఎంతవరకు కృతార్థుడ నైతినో పాఠకులే గ్రహింతురుగాక!

ఇట్లు భవదీయుడు

'భాషాప్రవీణ'

సాదినేని రంగారావు (M. A.)

రచయిత

తెనాలి

14-4-83

# అంకితము

సీ॥ ఏదేవు గుణకీర్తనాదికంబునఁ జేసి
వాల్మీకి వాఙ్మయబ్రహ్మ యయ్యె
ఏదయామయు దివ్య పాదాబ్జరజముచే
కఠిన పాషాణంబు కాంత యయ్యె
ఈరేడులోకాల నే మహాదేవుని
దలచిన పాపముల్ తొలగిపోవు
ఈరేడులోకంబులే దేవదేవుని
పాదపద్మములకుఁ బ్రణతిసేయు

గీ॥ భక్తరక్షణశీలుఁడై పరగు నెవడు
లక్ష్మణుడు సీత యిరుప్రక్కలను భజింప
భద్రగిరి నుండు నా రామభద్రుడెపుడు
మమ్ము రక్షింపఁ గరుణారసమ్ము పొంగ.

శ్రీ ర స్తు

# భద్రాద్రి సీతారాముల కళ్యాణము

శ్లో॥ జానక్యాః కమలాకమలాంజలిపుటేయాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకేచ విలసత్కుందప్రసూనాయితాః
స్రస్తా శ్యామల కాయకాంతి కలితాః యాః ఇంద్రనీలాయితాః
ముక్తాస్తా శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః॥

అదిగో! స్వస్తిశ్రీ చాంద్రమానేన రుధిరోద్గారినామ సంవత్సర చైత్ర శుద్ధ నవమినాడు భద్రాద్రి సీతారాముల కళ్యాణ మహోత్సవము చేయ నిశ్చయించినట్లున్నది. ఆకళ్యాణశుభలేఖలు బంగారు లేఖలపై వ్రాయించి దేశదేశములకు, నగరనగరమునకు, గ్రామగ్రామమునకు, పల్లెపల్లెకు, పేటపేటకు పంపినట్లున్నారు. ఆ శుభలేఖల గ్రహీత లందఱు నేటికికదా! ఆ భద్రాద్రి సీతారాముల కళ్యాణ మహోత్సవము కనులారా చూచెడి భాగ్యము కలిగినదని మహదానందముతో సీతారాముల పెండ్లిపాటలు పాడుకొనుచు వచ్చుచున్నారు. అరుగో! లక్షలాది ప్రజలు బస్సులపై, కార్లపై వచ్చుచున్నారు. కొందఱు గోదావరినదిపై లాంచీలలో పడవలలో "సీతారాముల కళ్యాణము చూచివద్దము రారండి" అంటూ సీతారాముల పెండ్లిపాటలు పాడుకొనుచు వచ్చుచున్నారు.

అదుగో ! లక్షలాది ప్రజలు పుణ్యగోదావరి నదిలో స్నానము చేయుచున్నారు. కొందఱు ప్రజలు పుణ్యగోదావరినదీమ తల్లికి పూజలుచేసి మ్రొక్కుచున్నారు. కొందఱు పావన నదీమ తల్లి గోదావరిని స్తోత్రము చేయుచున్నారు. కొందఱు గోదావరి మాహాత్మ్యమును కొనియాడుచున్నారు. అదుగో! నూతన దంపతు లట్లున్నది. ఏవేవో సంభాషించుకొనుచున్నారు. భార్య, భర్తను అడుగుచున్నది. స్వామీ! ఈనదికి గోదావరి అని పేరెట్లు కలిగి నది? అని. భర్త పుణ్యగోదావరిని గూర్చి చెప్ప ప్రారంభించెను.

దేవీ! పూర్వకాలమున భగీరధుడు ఆకాశగంగను భూలోక మునకు తీసికొనివచ్చినట్లుగా, గౌతమ మహామునీంద్రుడు ఆ హిమాచల ప్రదేశమునుండి జగత్పావని యగు గోదావరిని తోడ్కొని తెచ్చెను. అయ్యదియే ఈ పుణ్యగోదావరి నది. ఇది శివుని జటాజూటమువలన కలిగిన పవిత్ర గంగయొక్క భాగము. పూర్వము మహాకాటకము సంభవించి తినుటకు ఏమియును లభిం చక యున్నపుడు మునులందరు గౌతముని యాశ్రమమునకు వచ్చిరి. గౌతముడు పడచిన వరముచే అతని పొలములుమాత్రము పండుచుండెను. ఆపంట వచ్చినవారి కెల్లరకు గౌతముడు పెట్టు చుండెను. ఇతనిసంపద కోర్వలేక కొందరు మునులు మాయ గోవును సృజించి గౌతమునిచేను మేయుచుండుమని పంపిరి. గోవు చేనుమేయుచుండుట గౌతమునకు దెల్పిరి. చేను పోవుచుం డుటకు విచారించి, గోవును కొట్టలేక, గౌతముడు పొమ్మని జల

మును గోవుపై చల్లెను. నీటిబిందువులు దాని శరీరముపై పడగనే ఆగోవు చచ్చి క్రిందపడెను. అపుడు మునులు ఛీ, ఛీ ఈగోవధ చేసినవానియింట భుజింపరాదని లేచిరి. గౌతముడు వారినిప్రార్థించి, ఏకార్యమువలన నీగోహత్యా పాతకము పోవునో చెప్పుడని వారిని వేడెను. అచ్చటకు గంగను తీసికొనివచ్చిన పాతకము పోవునని వారు తెల్పిరి. గౌతముడు శివునిగూర్చి తపస్సు చేసెను. అతడు ప్రత్యక్షమై తనజట నొకదానిని దీసియిచ్చి యిది పిండుము. ఆ గోవు బ్రతుకును అని చెప్పెను. గౌతముడు దానిని పుచ్చుకొని తెచ్చి గోవుపై పిండెను. గోవు లేచి స్త్రీరూపధారిణియై చనెను. ఆ జలమే నదియయ్యె. గోవును బ్రతికించెను గాన గోదావరి యని దానికి పేరు వచ్చెను. గౌతముడానదిని దీసికొనివచ్చుటచే గౌతమి యను పేరుకూడ వచ్చెను.

ఈగోదావరినదికే దక్షిణగంగ అను ప్రఖ్యాతి కలదు. దీని మొత్తముపొడవు 937 మైళ్ళు. ఈనది మహారాష్ట్రలోని నాసికా త్ర్యయంబకము అనుచోట జన్మించినది. అచ్చటపుట్టి నిజామాబాద్ జిల్లాలో బసర్ అనుచోట మన రాష్ట్రములోనికి ప్రవేశించెను. అటనుండి పాపికొండల నడుమనుండి ప్రవహించి పోలవరము దగ్గర సమతలమునకు చేరెను. ఈప్రాంతము ప్రశాంతతకు, మనోహర దృశ్యములకు నెలవు. అటనుండి గోదావరి ప్రవహిం చుచు వచ్చి రాజమండ్రిదిగువ ధవళేశ్వరముదగర వశిష్ఠ, గౌతమి అను రెండుపాయలుగా చీలినది. వశిష్ఠ గోదావరి దక్షిణదిశగా

ప్రవహించి నరసాపురమునకు సమీపమునగల అంతర్వేది దగ్గర సముద్రమున కలియుచున్నది. ఇదికాక వైనతేయము అనుపేరు గల మరియొక గోదావరిపాయ రాజోలుతాలూకా దక్షిణభాగమును ఒకద్వీపముగా చేయుచుపోయి సముద్రమున సంగమించుచున్నది.

ఈ పుణ్య గోదావరినదియే తన పవిత్రజలముచేసకలజనుల పాపములను పోగొట్టి స్వర్గలోక మందజేయును. మరియు ఈ నదియే పుణ్యనదియని తలచి, ఎవరు ఇందు స్నానమాడెదరో, వారు వైకుంఠమును చేరగలరు. అని భర్త చెప్పెను. ఈనూతన దంపతులిద్దరు పుణ్యగోదావరిలో స్నానముచేసి, జగత్పావనియగు నదీమతల్లిని పూజించి, స్తోత్రముచేసి, భద్రగిరిపైనున్న సీతారాములను దర్శించుటకై బయలుదేరిరి.

అదిగో! పుణ్యగోదావరి ఒడ్డునుండి భద్రగిరిపై నుండు సీతారాముల వద్దకు చలువపందిళ్ళు వేయించిరి. ఆపందిళ్ళలో లక్షలాది ప్రజలు ఎండపొడ తగులకుండగా సీతారాముల దర్శనార్థమై పోవుచున్నారు. ఆ నవదంపలుకూడ సీతారాముల దర్శనార్థమై బయలుదేరిరి. మరల భార్య, స్వామీ! శ్రీరాములవారు సీతాలక్ష్మణ సమేతముగా ఈభద్రగిరిపై నుండుటకు కారణ మేమిటండి? అని అడుగుచున్నది. భర్త భద్రగిరినిగూర్చి చెప్పుచు పోవుచున్నారు.

దేవీ ! పూర్వ కాలమున శౌనకాది మహా మునీంద్రులు పౌరాణిక శ్రేష్ఠుడగు సూతుని ప్రార్థించి, స్వామీ ! సకలజనులకు

ప్రీతికరంబైనట్టియొక పుణ్యకథను చెప్పుడని ప్రార్థించిరి. అప్పుడా సూతుడీ విధముగా చెప్పదొడగెను. మునీంద్రులారా ! ఈ లోక మున దండకారణ్య మధ్యమున పుణ్య గోదావరీ నదీ తీరమున శ్రీరామ క్షేత్రమున జనన మరణ వ్యాధి బాధాపీడితులగు నరులకు అమృత పదంబొసగుటకై శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతముగా వేంచేసియుండునట్టి భద్రాద్రియన పర్వత శ్రేష్ఠం బొకటి కలదు. ఆ పుణ్యపర్వతము భక్తులకు కల్పవృక్షము, కామధేనువులాంటివి. కనుక నీ మహిమనుగూర్చి చెప్పుట బ్రహ్మకైనను తరముగాదు. ఐనను నాకు తెలిసినవఱకు చెప్పెద వినుము.

పూర్వ కాలమున హిమవంత దంపతులు సంతానముకై బ్రహ్మనుగూర్చి కఠోరముగా తపస్సుచేసిరి. ఆ హిమవంతదంప తుల కఠోర తపస్సునకు బ్రహ్మదేవుడుమెచ్చి వారికి దర్శనమిచ్చి మీకేమి కాలయునో కోరుకొనుడనెను. అప్పుడా పర్వత రాజదంప తులు ఓ దేవా ! మాకు శ్రీరాముని ధ్యానించు పుత్రుని కలుగ జేయమని ప్రార్థించిరి. అంత బ్రహ్మదేవుడా వరమిచ్చి అంతర్ధా నము చెందెను. కొంత కాలమునకు పర్వతరాజ దంపతులకు భద్రు డను పుత్రుడు పుట్టి సీతారామానుగ్రహముపొంది, ఆ దేవదేవునికి నివాసమయ్యెను. దానికి మూలకారణమగు మరియొక కథ చెప్పెద సావధానముగా వినుము.

త్రేతా యుగమున దశరథ మహారాజు కుమారుడైన శ్రీరామచంద్రుడు తండ్రి యాజ్ఞను తలదాల్చి దండకారణ్యమున

కాలము గడుపుచుండెను. ఒకనాడు సీతారామలక్ష్మణ సమేతముగా అరణ్యమున పోవుచుండెను. కొంత దూరముపోగా వారికి మార్గాయాసము కలిగెను. వారు మార్గాయాసము తీర్చుకొనుటకై ప్రశాంతమైన చోటు వెదకుచుంటిరి. అంతలో వారికి విశాలమైనట్టియు, నిర్మలమైనట్టియు ఒక శిల కన్పించెను. సీతారామలక్ష్మణులు కొంతసేపు ఆ శిలపై విశ్రమించి మార్గాయాసమును పోగొట్టుకొని చాల సంతోష సమయములో ఆ శిలనుచూచి వారు నీవు మాకు మార్గాయాసమును పోగొట్టి సంతోషమును కలుగజేసితివి. కనుక నీవీ సుకృతమువలన చిరకాలమునకు మేనకా హిమవంత దంపతులకు పుత్రుడవై పుట్టి, శైలరూపధారివై మాకత్యంత ప్రియ భక్తుడవు కాగలవని వరమిచ్చి పోయెను. తరువాత శిల జడరూపమయ్యెను. శ్రీరామచంద్రుని వరమువలన జ్ఞానవంతుడై కొంత కాలమునకు పర్వతరాజ దంపతులకు పుత్రుడై పుట్టెను. పూర్వ జన్మ సుకృతమువలన ఆ భద్రుడు శ్రీరామభక్తుడై బహుకాలము శ్రీరామునిగూర్చి తపస్సు చేసెను. చివరకు దయామయుడగు శ్రీమన్నారాయణుడు శ్రీ వైకుంఠమున లక్ష్మీసమేతుడై సమస్త దేవతలు కొలుచుచుండ శేషశాయి లీలావినోదములదేలుచుండియు భక్తవత్సలుడు కావున పరమ భక్తాగ్రగణ్యుడగు భద్రుని రక్షింప గోరి శ్రీరామచంద్రుని రూపము ధరించి, శ్రీదేవి, ఆదిశేషుడు సీతారామలక్ష్మణులై వెంటరాగా తపోనిష్ఠుడైయున్న భద్రునివద్దకు పోయి తపస్సునకు మెచ్చితిని వరముకోరుకొనుము ఇచ్చెదననెను.

అంతట భద్రుడు శ్రీరామచంద్రుని పల్కులు విని, కనులు తెరచినంతయెదుట నీలమేఘచ్ఛాయగల దేహముతో కోటిమన్మథాకారుడై నీలి మేఘమధ్యమున తొలకరి మెరుపువలె తన ప్రక్క జానకీదేవి నిలువ,ధనుర్బాణములనుబట్టి లక్ష్మణుడునువారిమ్రోల నిలచెను. వారినిచూచి భయభక్తులతో సాష్టాంగదండ ప్రమాణములాచరించి, చేతులు జోడించి, స్వామీ ! శంక, చక్ర, గదా, శార్ఙ్గాద్యాయుధములు ధరించి సమస్త లోకములకు శుభములనిచ్చుచు దయమయుడవై నాబోటి వానికి మోక్షమిచ్చి రక్షించుచు, అనంత కోటిసూర్యప్రకాశ తేజోమూర్తివై ప్రకాశించు చుండెడి నీకు నా కృతజ్ఞాతాభివందనములని ప్రార్థించెను. నను జడుడనియు, మూఢుడనియు, పరిహసింపక అనుగ్రహింపుము స్వామీ!అనిప్రార్థించెను

అంత శ్రీరాముడు నీ భక్తికి మెచ్చితిని వరము కోరుకొనుమనెను. అప్పుడా భద్రుడు బ్రహ్మాదులకు సహితము దొరకని మీ దర్శనమును మీరు నా కొసంగిరి. అయినను మదీయ చిరకాల అభీష్టమును వ్యక్తీకరించెదను. సీతాలక్ష్మసమేతులై మీరు నా శిరస్సున నివసించుము. నాకింతకంటే ఎక్కువ కోరికలేదు. స్వామీ! అని ప్రార్థించెను. అంతట దయామయుడు, భక్తవత్సలుడగు, శ్రీరామచంద్రుడు భద్రుడా ! నీవు కోరిన వరమిచ్చితిని. సూర్య చంద్రులు, నక్షత్రములు భూమ్యాకాశములుండువఱకు నన్ను నీ శిఖరమున ధరించి, నాకు సేవలుచేయునట్టి వారికి, నా భక్తులకు, నా కళ్యాణ మహోత్సవమును చూచుటకువచ్చిన వారికిని, నా

కళ్యాణము చదివినవారికిని, వినినవారికిని ఆయురారోగ్య భోగ భాగ్యములను, సంతానము లేనివారికి సత్సంతానమును ఇచ్చి కాపాడుచుందుము. కల్పాంతమున నా యనుగ్రహమువలన నీయీ స్వరూపము విడిచి నిర్మల జ్ఞాన సంపన్నుడవై నా నివాసమగు వైకుంఠమునకుచేరి సుఖించెదవు.

అదియునుగాక ఈ నదియే పుణ్య నదియని తలచి, ఎవ్వ రిందు స్నానమాడి నేను నివసించియుండెడి నీ శిరః ప్రదేశమే వైకుంఠమని తలచెదరో వారు పూర్వ జన్మమున చేసిన పాపము లను బాసి, పుత్రపౌత్రాభివృద్ధి కలిగి సమస్త సిరిసంపదలతో ఇహమునకల భోగముల ననుభవించి, జన్మాంతమున నా నిలయ మగు వైకుంఠమునకు చేరెదరు అని చెప్పి శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సమేతముగా భద్రుని శిరమున నివసించెను. కావున ఆ దినము మొదలుకొని భద్రాద్రి భూలోక ప్రజలకు సాక్షాత్తు వైకుంఠమై వెలసెను. ఇప్పుడీ లోకమున ఎవ్వరైనను మేలుగోరి నట్టివారు భద్రాచలమున శ్రీరామనవమినాడు సీతారాముల కళ్యాణ మును చూచి, ఆ రాత్రి జాగారముచేసి, రామనామ స్మరణ చేసెద రేని వారు రాముని చేరెదరు. మఱియు భద్రాచలము చుట్టును మూడు క్రోసుల దూరమునకు లోపల త్రైలోక్య ప్రశస్తములగు పుణ్య తీర్థములన్నియు శ్రీ రామజ్ఞ వలన సన్నిహితములై యుండును. కావున అచట మూడు రాత్రులు నివసించిన నరులు శాశ్వత సుఖ ప్రాప్తి నొందెదరు. దానికి ఉదాహరణగా తొల్లి

త్రైలోక్య సంచారియగు నారదుడు బ్రహ్మదేవుని వలన నీ క్షేత్ర మహాత్మ్యమువిని, భద్రాచల క్షేత్రమునకు వచ్చి, పుణ్యగోదావరి నదీ తీరమున రామనామ సంకీర్తన చేయుచు బహుకాలము నివసించిన పిదప దేవలోకమునకు పోయెను. కనుక ఈ భద్రాచల మహిమ సవిస్తరముగా చెప్పవలయునన్న సహస్ర దివ్య సంవత్సరములైనను చాలవు. కనుక నా శక్తికొలది సంగ్రహముగా మీకు తెలిపితిని అనెను.

తరువాత శేషేతర ఊష్మకుండనామ ప్రఖ్యాత క్షేత్రములనుగూర్చి సంగ్రహముగా యీ విధముగా చెప్పదొడగెను. ఈ భద్ర పర్వతమునకు ఆగ్నేయ దిశగా రెండు కోసుల దూరముగా గోదావరీ గర్భమునందు శేషేశ్వర ఊష్మకుండనామ ప్రఖ్యాత క్షేత్రములున్నవి. బహుపురాతన కాలమున క్రూర రాక్షసులు నాగలోకముపై దండెత్తగా నాగేశుడగు శేషుడువారితో పోరాటజాలక సత్యలోకముచేరి అచ్చట తేజరిల్లుచున్న చతుర్ముఖ బ్రహ్మను సందర్శించి స్థితిగతులను వివరించెను. దివ్యదృష్టి సంపన్నుడైన చతుర్ముఖుడు విషయ సర్వస్వము గ్రహించి శేషా ! నీవు భూతలముచేరి భద్రాద్రి సమీపమున గౌతమీ తీరమందు మహేశ్వర ధ్యాన నిమగ్నుడవై తపస్సుచేయుము. తద్వారా నీ మనోభీష్టము నెరవేరగలదు. అని పలుకగా శేషుడు బ్రహ్మ దేవుని వచనానుసారము గౌతమీ తీరముచేరి అందొక్క ప్రదేశమున శివ ప్రతిష్ఠ చేసి ఆ మహాదేవునికై తీవ్ర తపమాచరించెను. ఆ కాలములోనే

అచ్చట ఒక పవిత్ర ప్రదేశమున ఒక ఉష్ణగుండమును తయారు చేయించి అందు పవిత్ర హృదయముతో హోమముచేయ భక్త జనవ శంకరుడగు శంకర భగవానుడు ప్రసన్నుడై సాక్షాత్కరించి అతనికి సర్వ శాత్ర వినాశన సమర్థమగు దివ్య శూలమును ప్రసాదించి భక్తా ! దీని ప్రభావముతో నీవు నీ శత్రు వీరులను సమూలముగా నిర్మూలించి నీ రాజ్యమును సుఖముగా పాలించుకొనెదవు గాక ! అని పలుకగా నాగరాజగు శేషుడు పరమానందమంది మహాదేవ భగవానుని వేయినోళ్ళ ప్రస్తుతించి ఉత్తరక్షణమున రసాతలముచేరి శివప్రసాదితమైన దివ్య శూలముతో శత్రు సమూహములను చీల్చిచెండాడి రాజ్య సుఖములను అనుభవింపసాగెను.

ఆదిశేషువు పాతాళ లోకమునుండి భూతలముచేరి గౌతమీ పుణ్యతీరమున తపమాచరించి తన మనోభీష్టమును నెరవేర్చుకొనెను. ఆ కాలములో భూతలమునుండి రసాతలమునకు పోయి నఖిలద్వారముల భోగవతీ నదీ సలిలములు గౌతమీ ప్రవాహమునకలిసె, గావున ఆస్థానము రసాతల గంగా సంగమమని ప్రసిద్ధినొందెను. శేష ప్రతిష్ఠమైన ఆ శివక్షేత్రము నాటినుండి శేషేశ్వర స్థాననామ ప్రసిద్ధమాయెను. ఆ శేషుడు హోమముచేసిన హోమ గుండము అగ్ని జ్వాలా సంభరితమై అందలి జలములు ఉష్ణముగ నుండుటవలన ఉష్ణగుండమని విఖ్యాతి వహించెను. కావున ఈ తీర్థమందు శ్రద్ధా భక్తియుక్తులై మానవు లొనర్చు తపోయాగ జపదానాదులు అనంత ఫలములను ప్రసాదించును. అట్లుచేయ

శక్తిసామర్థ్యములు లేనివారు యీక్షేత్రమహాత్మ్యమును విశుద్ధాంతకరణతో పఠించిననూ ఆలకించినను తత్తుల్యమైన సత్ఫలితములను పొందగలరనుట నిర్వివాదాంశము. అని ఈవిధముగా శౌనకాది మహామునులకు చెప్పెనని భర్త భార్యతో చెప్పెను

అదుగో! భార్యాభర్తలు భద్రిగిరి ఎక్కుటకు పశ్చిమసింహ ద్వారము వద్దకు వచ్చిరి. సింహద్వారముపై గల కోదండరాములను శంఖ, చక్రములను తిలకించుచున్నారు. ప్రజలంతా చలువ పందిళ్ళలో కిక్కిరిసినట్లుగా నున్నారు. కొండ ఎక్కుటకు చక్కని మెట్లనుకూడ చెక్కిరి. ఆమెట్లలో కొండఎక్కుచున్న భక్తుల ప్రతిబింబములు కన్పించుచుండెను. మెట్లవద్ద కొండఎక్కుటకు భక్తులు పాదప్రక్షాళన చేసికొనుటకు జలయంత్రములను ఏర్పరచబడెను. లక్షలాది ప్రజలు జలయంత్రముల క్రింద పాదప్రక్షాళన చేసికొని సీతారాముల దర్శనార్థమైభద్రగిరి ఎక్కుచున్నారు. అందులో ఆ భార్యాభర్తలు కూడ పోవుచున్నారు. అప్పుడతని భార్య స్వామీ! ఈ భద్రిగిరిపై ఈ దేవాలయము కట్టించిన దెవరు? వాని చరిత్ర ఎట్టిది? అని అడుగుచున్నది. అప్పుడాభర్త ఈవిధముగా చెప్ప దొడగెను.

దేవీ! పూర్వకాలమున ఈభద్రాచల సమీపమున ఒకచిన్న గ్రామము కలదు. అందు తమ్మల (పోకల) దమ్మక్క యను భక్తురాలు కలదు. ఆమెకు చిన్నతనమునుండియు సీతారాములనిన ఎంతో ప్రేమ, భక్తి. ఆమెకు ఒక్కతే కూతురు కలదు. ఆ తల్లి

కూతురు కలసి శ్రీరామనామ సంకీర్తనయే చేసికొనుచుండిరి. ఆ తమ్మల దమ్మక్క భక్తికి మెచ్చి శ్రీరామచంద్రు డొకనాడు వేకువజామున స్వప్నమునందు కన్పించి భక్తురాలా! నేనీ భద్రి గిరిపైన నుండు శ్రీరాముడను. నేనీ భద్రిగిరిపై నుండు సంగతి ప్రజలకు తెలియజేసి నాకు నిత్యోత్సవములు జరుపుచుండుము. జన్మాంతమున నీవు నా వైకుంఠమును చేరగలవు. నీతరువాత నా ప్రియభక్తుడు రామదాసు ఈ గ్రామమునకు అధికారిగా రాగలడు. అతడు నాకు దేవాలయమును కట్టించి, బ్రహ్మోత్సవములు జరుపును. అప్పటివరకు నన్ను పూజించుచుంటివేని నీవు నన్ను చేరగలవు. అని చెప్పి అంతర్ధానము చెందెను.

అంతట తమ్మలదమ్మక్క నిద్రలేచి ప్రజలను దీసికొనిపోయి భద్రిగిరిపై శిఖరముపైవెదకెను. అచ్చట చెట్లు, చేమలు, ఆకులు అలములచే క్రమ్మబడిన సీతారామ లక్ష్మణుల విగ్రహములు కన్పడెను. అప్పుడే సీతా రామ లక్ష్మణులకు పాకలు వేయించి, పూజలు చేయుచుండిరి, తమ్మల దమ్మక్కయు, కూతురును జీవితాంతము సీతారాములను సేవించి జన్మాంతమున స్వర్గమేగిరి.

కొంతకాలమునకు అలకాపురిని మించునట్టి గోలుకొండ యను పట్టణమున తానీషా యను నవాబు పరిపాలించు చుండెను. అతడు కులముచే మ్లేచ్ఛుడైనప్పటికిని శ్రీరామలక్షణుల సాక్షాత్కారము పొందెను. వారివద్ద అక్కన్న, మాదన్న యను మంత్రులు కలరు, వీరికి కంచెర్ల గోపన్న యను మేనల్లుడు కలడు.

ఆగోపన్న కొండపల్లె గ్రామములో కామాంబకు, లింగన్న మంత్రికి జన్మించెను.

గోపన్న చిన్నతనము నుండియు పరమభక్తుడు. తల్లి యొడిలోనుండి పాలుత్రాగుచుకూడ తండ్రిగారు రామాయణము పఠనము చేయుచుండగా పాలుత్రాగుట కూట మాని రామాణము ఆలించెడివాడట. క్రమముగా ఆగోపన్న విదియనాటి చంద్రునివలె వృద్ధిచెందెను. చిన్నతనములోనే బాలరామాయణము పఠించుచు ఆ రామునికాలములో నేనేల పుట్టి సీతారాములకు సేవలు చేయ లేకపోయితి నని చింతించెడివాడు. గోపన్న భక్తిపారవశ్యముతో దాశరథీశతకములాంటివి ఎన్నియో గ్రంథములు రచించెను. ఒక నాడు గోపన్న బాలరామాయణము చదువుచుండగా కబీరుదాసను మహాభక్తుడు వాని ఇంటికి వచ్చెను. అప్పుడాకబీరుదాసు గోపన్న ముఖముచూచి, ఈతడొక గొప్ప రామభక్తుడు కాగలడని చెప్పి, గోపన్నచేయి చూచి, నీకు శ్రీరామచంద్రానుగ్రహము కలుగగల దని చెప్పి, 'శ్లో॥ శ్రీరామరామేతి రమే రామే మనోరమే! సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥' అని తారకనామ ముపదేశించి పోయెను.

ఒకనాడు గోపన్నకుదివ్యస్వప్నమునందుశ్రీరామచంద్రుడు కన్పించి నీకు భద్రాచల తహశీలుదారుపని రాగలదు. ఆభద్రగిరిశిఖ రము పైననే నేను సీతాలక్ష్మణ సమేతముగా వెలసితిని. నీవు నన్ను సేవించిన నీవు నావైకుంఠము చేరగలవని చెప్పి అంతరా

నము చెందెను. అంత గోపన్న తల్లిదండ్రులవద్ద ఆజ్ఞ గైకొని మేనమామలగు అక్కన్న మాదన్నల వద్ద కుపోయి తానీషాదర్శనము కలుగజేయవలసిన దని ప్రార్థించెను. అంతట గోపన్నను తానీషా వద్దకు కొనిపోయిరి. తానీషావారు గోపన్న వినయవిధేయతలకు ముగ్ధుడై భద్రాచలతాలూకా తహశీలుడారుగా గోపన్నను నియమించెను. అక్కడ గోపన్న సీతారాములను సేవించుచు పూజించుచుండెను. భద్రాచలవాసులంతా గోపన్నభక్తికి మెచ్చి "రామదాసు"గారు అని పిలుచుచుండిరి. అప్పటినుండి గోపన్నకు రామదాసని నామాంతర మేర్పడినది.

అప్పుడు భద్రగిరిపై తమ్మల దమ్మక్క వేయించిన పాకలు జీర్ణమై సీతారామలక్ష్మణులు ఎండకుఎండి, వానకు తడియుచుండిరి. ఆ ఎండకుఎండి వానకుతడియుచున్న సీతారాములనుచూచి రామదాసుగారు నాతల్లిదండ్రులు సీతారాములుఎండకు ఎండి, వానకు తడియుటయా! అని తనవద్దనున్న సర్కారుపైకముతో జగజ్జననీజనకులగు ఆసీతారాములకు దేవాలయము కట్టించెను. ఈ విషయము ఆనోట ఆనోటపడి తానీషాగారికి తెలసెను. వెంటనే తానీషా మండిపడుచు గోపన్నను తీసికొనిరండని భటుల కాజ్ఞాపించెను అంతట రాజభటులు రామదాసుగారిని ఖండిత ఉచ్చుకత్తుల పారాలతో తీసికొని పోవుచుండిరి. అలనాడు శ్రీరామచంద్రుడు తండ్రియాజ్ఞను తలదాల్చి అడవులకు పోవునపు డేవిధముగా అయోధ్యాప్రజలు దుఃఖించిరో, అదేవిధముగా రామదాసుగారిని ఖండితఉచ్చుకత్తుల పారాలతో తీసికొనిపోవునపుడు భద్రాచలప్రజ

లంతా దుఃఖసముద్రములో మునిగిపోయిరి. అప్పుడు భద్రాచలము రాముడులేని అయోధ్యానగర మయ్యెను. తండ్రినిబాసి యేడ్చు బిడ్డవలె భద్రాచల ప్రజలంతా దుఃఖించిరి.



భటులు రామదాసుగారిని తానీషావద్దకు తీసికొనిపోయిరి. తానీషా రామదాసుగారిని చూచి మండిపడుచు "క్యారే హమారే పైసే క్యోం ఖర్చుకర్‌దియా" అంటూనే వానిని కొరడాలతో ఒళ్లు పగులగొట్టి జైలులో పెట్టించెను. రామదాసుగారు ఆ భద్రాద్రిసీతారాములనే తలచుకొనుచు జైలుబాధల ననుభవించు చుండెను. రామదాసుగారిని రోజు ఉదయము. సాయంకాలము కొరడాలతో కొట్టి వేడినీళ్ళుపోసి, జైలులో పెట్టుచుండిరి. తానీషా ప్రతిరోజు రామదాసుగారికి పావుశేరు బియ్యం, పావుశేరు ఉప్పు భుక్తికి యిచ్చుచుండెను. దానినే రామదాసుగారు ఆ భద్రాద్రి సీతారాములకు నివేదించును. అప్పుడవి పంచభక్ష్య పరమాన్నములుగా మారును. దానిని రామదాసుగారు సీతారాముల వరప్రసాదముగా భావించి భుజించును.



ఒకనాడు తానీషా రామదాసుగారు ఎట్లున్నాడో చూడవలయునని భటుల నడిగెను. వారు స్వామీ! మీరుయిచ్చు మోయనను రామదాసు తిని తెగబలసినాడని సమాధానము చెప్పిరి. అంత తానీషా కన్నెర్రచేసి వానిని ఈడ్చుకొని రండని ఆజ్ఞాపించెను. భటులు రామదాసుగారిని రెండుచేతులు పట్టుకొని ఈడ్చుకొని వచ్చిరి. రామదాసుగారు భద్రాచలమునుండి వచ్చునపు డేవిధముగ

నున్నాడో అదేవిధముగా నుండెను. తానీషా క్రోధావేశముతో వీనిని చిత్రహింసలు చేయుడని ఆజ్ఞాపించెను. భటులు రామదాసు గారిని కొరడాలతో కొట్టి, వేడినీళ్ళుపోసి, సూదులను గ్రుచ్చిరి. అట్టిబాధలలోకూడ రామదాసుగారు సీతారాములనే తలచుకొను చుండెను. ఒకనాడు రామదాసుగారిని కత్తులపై నడిపించిరి. రామ దాసుగారు నడువపోగా ఆకత్తులు భూమిలోనికి దిగిపోయెను. ఒక నాడు రామదాసుగారి తలమీద నడివీధిలో నుండు నల్లగుండు పెట్టి నాలుగువీధులు త్రిప్పిరి. అప్పుడుకూడ రామదాసుగారు తారకనామ మునే ధ్యానించుకొనుచుండెను. అప్పుడు భటులు తానీషావద్దకు పోయి జరిగిన విషయము నంతయు చెప్పిరి. తానీషా వీని నెట్లు శిక్షించుటయా? అని ఆలోచించుచు ఆరాత్రి నిద్రించెను. అప్పుడా రామదాసుగారు కష్టములను ఓర్చుకొనలేక రాత్రింబగళ్ళు రామునే ధ్యానించెను. కాని కష్టములు తగ్గుముఖము పట్టకపోగా, అవి ఎక్కువగుచుండెను. అప్పుడు రామదాసుగారు బాధలకు తట్టుకోన లేక ఓ భద్రగిరివాసా! రామభద్రా! నాకష్టములను బాపుటకు నీకు సమర్థత లేకున్నయెడల మా అమ్మ సీతమ్మవారితో నయినా చెప్పరాదా! అని ప్రార్థించెను. ఆ ఆర్తనాదము సీతమ్మవారికి విన్పించెను. అప్పుడు సీతమ్మవారు శ్రీరాముని స్వామీ! మీ భక్తా గ్రగణ్యుడగు రామదాసుని రక్షింపుడని ప్రార్థించెను. అప్పుడా రామలక్ష్మణులు వేకువజాముననే తానీషాకు స్వప్నములో రామ దాసుగారి పైకముచెల్లించి రసీదుకూడ తీసికొన్నట్లుగా కన్పించెను. అంతట తానీషా ఆ స్వప్నవృత్తాంతము సంగతి భార్యాభర్తలు

చెప్పుకొనుచు, ఆస్వప్నమువలన మేలు కలుగునో, కీడుకలుగునో యని భయపడుచుండిరి. ఇంతలో జట్టివేషధారులైన రామలక్ష్మణులుతానీషా! అని తలుపు తట్టిరి. అంత తానీషా గడగడవణకుచు తలుపు తీయగా జట్టివేషధారులు డబ్బుల సంచులతో నిలువబడి యుండిరి. తానీషా, మీది ఏ ఊరు? మీరెవరు? అని ప్రశ్నించెను. జట్టివేషధారులు, మేము భద్రగిరివాసులము, రామదాసుగారి సేవకులము. మాపేర్లు రామోజీ, లక్ష్మోజీ అని సమాధానము చెప్పిరి. జట్టివేషధారులు డబ్బులసంచులను క్రుమ్మరించిరి. తళతళమెరసే ధనరాసులు నిలువెత్తున కుప్పలుపడెను. ఆ ధనరాసులకు తానీషా ఆశ్చర్యపోయి వెంటనే రామదాసుని జైలునుండి విడుదలచేసెను. భక్తరామదాసుగారు కట్టించినదే ఈదేవాలయమని చెప్పుచు భార్యాభర్తలు మెట్లమీదుగా ఎక్కుచు పోవుచుండిరి. మరికొంతదూరము పోగా భార్య స్వామీ! నిండుగోదావరిలో సీతారాములను దర్శనమిప్పించిన ఆమహాభక్తు డెవరో? వానిచరిత్ర ఎట్టిదో? చెప్పుడని అడిగెను. అప్పుడు భర్త యీవిధముగా చెప్పెను.

దేవీ! పూర్వకాలమున తన కవితాస్రవంతిచే భద్రాద్రి రాముని మెప్పించి శ్రీవారి లీలలు అశేష ప్రజాసామాన్యమునకు దర్శనభాగ్యము కలుగజేసిన భక్తశిఖామణి ముత్తేవి పెరుమాళ్ళయ్యగారు. వీరు కృష్ణాజిల్లా దివితాలూకా పెదముత్తేవి గ్రామములో జన్మించిరి. వీరి ఇలవేల్పు ఆశ్రీరామచంద్రుడే. పెరుమాళ్ళయ్యగారికి చిన్నతనమునుండి భగవద్భక్తి మిక్కిలిఎక్కువగా

కలదు. రామదాసునకును వీరికి కొలదిసంవత్సరములు మాత్రమే తేడాకలదు. ఆకాలములో మొదటి ఆసఫ్‌జా హైదరాబాదును రాజ ధానిగా చేసికొని పరిపాలించుచుండెను. ఆనాడు భద్రాద్రిప్రాంతము కూడ అసఫ్‌జాపరిపాలనకు లోబడి యుండెను. అప్పుడు పెరుమా ళ్ళయ్యగారు భద్రాద్రి ఏతెంచి సీతారాముల గూర్చి అనేకపాటలు, పద్యములు పాడుకొనుచు అహోరాత్రములు ఆలయములోనే గడి పెడివాడు, ఆలయ స్థానికాధికారులు వీరి భక్తిప్రపత్తులను గురించి గౌరవముతో చూచెడివారు. ఎల్లప్పుడు పెరుమాళ్ళయ్య ఆలయము లోనే ఉండుటచే అర్చకుల లోటుపాటులను స్థానికాధికారులకు తెలియజేయుదురేమో నని అర్చకులు భయపడిరి. ఇందువలన వానిని ఇచ్చటినుండి మరెచ్చటికినైన బస మార్చుకొనవలసినదని చెప్పిరి. కాని పెరుమాళ్ళయ్యగారికి భగవత్సాన్నిధ్యము ఎడబాటు సహించలేక ఆలయములోనే సీతారాముల సన్నిధి కాలమంతయు గడిపెడివారు. ఇందువలన అర్చకులంతా వీరిపై ఈర్ష్యాద్వేషము లతో ఆలయమునుండి వెడలగొట్టవలయునని కుట్రలు పన్నుచుం డిరి. ఒకనాటి నడిరేయిని పెరుమాళ్ళయ్యగారు గాఢనిద్రలో నుడంగా అర్చకులు ఆలయములో ప్రవేసించి విష్వక్సేన తామ్ర విగ్రహములు గైకొని గోదావరినదికి వెళ్ళి అందులో దూరముగా పారవేచిరి. యధారీతిని అర్చకులు ప్రాతఃకాలమున ఆలయము నకు జని విష్వక్సేనుల విగ్రహములు కన్పడుటలేదని ఆందోళన నెళ్ళబుచ్చి, ఆదొంగతనము పెరుమాళ్ళయ్యపై మోపి ఆలయ

అధికారులకు తెలియజేసిరి. కాని పెరుమాళ్ళయ్యగారు ఈలాంటి నీచకార్యములకు పాల్పడడని ఆలయ అధికారులు భావించుటచే ఎట్టిచర్య తీసికొనలేదు. అప్పుడు అర్చకులంతా తమతమ అభీష్టము నెరవేరలేదని హుటాహుటి నిజాంనవాబు ప్రథమ అసఫ్‌జా వద్దకు వెళ్ళి, విగ్రహముల చోరత్వముగూర్చి అధికారులకు ఫిర్యాదు చేసినప్పటికిని చర్య గైకొనలేదని కొండెములు చెప్పిరి.

వెంటనే నవాబు ఉగ్రుడై భద్రాద్రి ఏతెంచి, పెరుమాళ్ళయ్యను దుర్భాషలాడి రేపటి సాయంకాలములోపుగా విగ్రహములు కన్పించనిచో సిరచ్ఛేదన చేసెదనని చెప్పెను. మహాభక్తుడైన పెరుమాళ్ళయ్య ఆరాత్రి అంతా జాగరణచేసి భద్రాద్రిరాముని పరిపరివిధముల స్తుతించి సొమ్మసిల్లిపడెను. అట్టిస్థితిలో స్వామివారు దర్శనమిచ్చి తనను అర్చకులు గోదావరిలో పారవేచిరనియు, ఉదయమే వచ్చి ప్రార్థించినచో వచ్చెదననియు అభయమిచ్చెను.

వెంటనే పెరుమాళ్ళయ్యగారు స్నానాదులు ముగించుకొని నవాబువద్దకు వచ్చి తన స్వప్నవృత్తాంతము ఎరిగించెను. కాని నవాబు యదార్థము విశ్వసించనివాడై పెరుమాళ్ళయ్యను పరుష వాక్యములతో దూషించెను. అంత పెరుమాళ్ళయ్యగారు "ఈ ఉదయమున నేను విష్వక్సేనులను గోదావరినుండి తెప్పించ జాలనిచో మీఖడ్గముతో నాశిరచ్ఛేదము గావించు" మని పల్కెను. ఉదయమే ప్రజాసమూహముతో గోదావరి చేరిరి. అచ్చట ఉత్తరీయము పరచి "దయచూడుము దేవా!" అని సీతారాములను ప్రార్థించెను.

అంతట స్వామివారు గోదావరినుండి బయల్వెడలి అలలమీద చిందులుత్రొక్కుచూ గంతులమీదనడచి ఉత్తరీయముమీదవాలెను, పరమాత్మ పాదస్వరూపము లేవిష్వక్సేనులు గాన భద్రాద్రిరాముని పాదదర్శన మిప్పించుడని స్తుతించెను. ఈ విధముగా స్వామివారని దర్శన మిప్పించిన పెరుమాళ్ళయ్యను గోదావరివద్ద చేరిన అశేష ప్రజానీకము "ఆంధ్రనమ్మాళ్వారు" అని బిరుదునిచ్చి సత్కరించిరి. తనపై ఇలాంటినింద మోపినందుకు నవాబునుద్దేశించి "నీ వారసులు రాజ్యభ్రష్టులగుదురుగాక" అని పెరుమాళ్ళయ్య గారు శపించిరి. అంతట నవాబు ప్రణమిల్లి పెరుమాళ్ళయ్యను శరణు కోరెను. పెరుమాళ్ళయ్యగారు కరుణించి భద్రాద్రిలో సీతా రాముల కళ్యాణము ప్రతి సంవత్సరము నీకుటుంబీకులు జరిపి స్వామివారి అక్షతలు మీరంతా శిరస్సున ధరించునెడల నీలగాయతు 7 తరములకు భోగభాగ్యములతో పరిపాలింతురనిచెప్పి ఊరడించిరి వారివాక్కునను సరించి దేశములో ఎన్నిరాజ్యములకు ఎలాంటి విపత్తువచ్చినను అసఫ్జా వంశీకుల రాజ్యము చెక్కుచెదరక ఏడవ తరములోని నవాబ్మీర్ ఉస్మాన్ఆలీఖాన్ 1911 లో నిజాం పదవినధిరోహించగా 26-1-1956 తేదీన మనకేంద్ర ప్రభుత్వపు పోలీసు చర్య ఫలితముగా రాజ్యము కోల్పోయెను. అని భర్త చెప్పెను. ఎందటో భక్తులు "భద్రాద్రిరామ గోవింద" అంటు గోవిందలు కొట్టుకొంటు పైకిఎక్కి పోవుచున్నారు.

అరుగో! భార్యాభర్తలు దేవాలయ దరిదాపులోనికి పోయిరి వారికి ఎడమప్రక్కగా యాగశాల. ఆ యాగశాలలోయజ్ఞ వేదిక

చుట్టు పురోహితులు యజ్ఞమంత్రములను చదువుచున్నారు. అనవ దంపతులు యాగశాలముందుగా క్యూలోపోవుచున్నారు. ఎడమ ప్రక్కగా రామకోటి పుస్తక భాండాగారమును తిలకించుచున్నారు. రామకోటి పుస్తకము లన్నియు అచ్చటనే పెట్టెదరుకాబోలు. తరువాత దామదాసుగారు చెఱసాలలోనున్న శిల్పమునుచూచుచున్నారు. ఆ శిల్పములో రామదాసుగారు జైలులో అనుభవించిన బాధ లన్నియు తెలియునట్లుగా ఆ భావములు కలుగునట్లుగా ఎంత నైపుణ్యముగా చెక్కారు! ఆ కష్టాలనుగూడ తలచుకొని భార్య భర్తలు సానుభూతిని తెలియజేయుచు వానికి నమసర్కించు చున్నారు. అదిగో! కుడిప్రక్క పవిత్సోవ మండపమును చూచు చున్నారు. ఆ మండపమువద్దనే ఉన్న పొగడవృక్షమును తిలకించు చున్నారు. ఆహా! ఆ పొగడ చెట్టెంతబాగున్నది భక్తులకు ఎండ తగులకుండగా ఎంతనీడ నిచ్చుచున్నది, ఆహా! వృక్షరాజమా! నీవుకూడ సీతారాముల దర్శనార్థమై వచ్చిన భక్తులకు సేవచేయు చున్నావా క్యూముందుకు సాగిపోవుచున్నది. భార్యాభర్తలు మఱి కొన్ని మెట్లెక్కిరి. కుడిప్రక్కగా లక్ష్మీతాయారుచూచి నమస్కరించుచున్నారు. అచ్చట పూజారులు పెట్టు దైవప్రసాదములను రెండు చేతులతో దోసిలిబట్టి గ్రహించుచున్నారు.

అదిగో! మఱికొంతదూరముపోగా పెద్దగుడి ఉత్తర ద్వారముగుండా క్యూదేవాలయములోనికి పోవుచున్నది. భార్యా భర్తలు క్యూలో లోనికిపోవుచున్నారు. భర్త తనధర్మపత్ని కుడి

చేయిపట్టుకొని తన కుడిచేతి చూపుడు వ్రేలితో చూపుచున్నాడు. ఎడమ ప్రక్కగా మళ్ళి అటుచూడుముదేవీ ! అదుగో 1 శ్రీ కురుత్తాళ్వార్ 2 రామానుజులవారు 3 శ్రీనమ్మాళ్వారు 4 శ్రీవిశ్వనాళ్వార్ 5 శ్రీ పెరియాళ్వార్ 6 తిరుమంగయాళ్వార్ 7 శ్రీ తొండరపొడియాళ్వార్ 8 శ్రీ తిరుముడిశయాళ్వార్ 9 శ్రీ సత్యనారాయణస్వామివారు. 10 శ్రీ సంతానగోపాలస్వామివారు. అదిగో ! అటుచూడుముదేవీ ! భద్రుని శిరస్సుపై రాముల వారి పాదములు కన్పించుచున్నాయి. మొదటేనీకు భద్రునికథ చెప్పితిని గుర్తున్నదా ? అని అడుగుచున్నాడు. ఆ....గుర్తున్నది స్వామీ ! అంటూ ముందుకు నడచిరి. 11 అయ్యదియే ఏకాదశి మండపము 12 శ్రీ వరదరాజస్వామివారు. 13 కోదండరామస్వామివారు 14 శ్రీ ఆండాళ్ళు 15 శ్రీ వెంకటేశ్వరస్వామివారు 16 శ్రీ వరాహస్వామివారు 17 శ్రీ మదనగోపాలస్వామివారు 18 పోయఘపూదత్తపేయాళ్వార్ 19 శ్రీ రాజ్యలక్ష్మి, సీతమ్మవారు 20 విజయగోపాలస్వామివారు 21. అయ్యదియే అద్దాల మహల్ 22 శ్రీ లక్ష్మినారాయణస్వామివారు 23 రామదాసుగారు 24 శ్రీ హయగ్రీవస్వామివారు 25 శ్రీ లక్ష్మితాయారు. అదిగో ! అయ్యదియేధ్వజస్థంభము. అదుగో ! వేలాది భక్తులు కొబ్బరికాయలుకొట్టిస్వామువారికి సమర్పించుచున్నారు సాంబ్రాణీ కడ్డీలు వెలిగించుచున్నారు. ఆ నూతన దంపతులుకూడ కొబ్బరికాయలు కొట్టి స్వామివారికి నివేదించుచున్నారు.

దేవీ! అదుగో! ఆంజనేయస్వామివారిని చూడుము. అత్యంత భక్తితో వినమ్రులై సీతారామలక్ష్మణుల మూలవిరాట్టునకు ఎదురుగా నిలచి ఎట్లు నమస్కరించు చున్నారో! అని చెప్పుచు భార్యాభర్తలు బండారులు చేతులుపట్టుకొని కొంగు ముడులతో గర్భాలయములోనికి ప్రవేశించ బోవుచున్నారు. ప్రక్కనఉన్న ద్వారపాలురనో, లేక శ్రీదేవి, భూదేవినో చూచుచున్నారు, దేవాలయ సంస్థవారు త్వరత్వరగా ముందుకు పొమ్మనమని హెచ్చరిక చేయుచున్నారు. భక్తుల వరుసవేగముగా జరిగిపోవు చున్నది. నవ దంపతులు మూలవిరాట్టులు సీతారామలక్ష్మణులకు నమస్కరించుచున్నారు. స్వామివారి దర్శనంచేసికొనిరి. అచ్చట ఉత్సవ విగ్రహములను కనులార తిలకించిరి. దక్షిణముగామళ్ళి దక్షిణద్వారపు తలుపులజే గంటలు గణగణమని దంపతులు మ్రోగించిరి. ఆ గణగణ ధ్వనులకు నవదంపతులు పరవశించిరి. దేవాలయసంస్థవారు త్వరత్వరగా కన్యాను ముందుకు పంపుచున్నారు.

ఆ దంపతులు అచ్చటినుండి ముందుగల శ్రీ నిరుప్పాణ్యాళ్వార్, తరువాత శ్రీ గోపాలస్వామివారిని తిలకించుచున్నారు. అక్కడనుండి దేవాలయపు దక్షిణసింహద్వారముగుండా పోవుచున్నారు. అచ్చట జయవిజయులను తిలకించుచున్నారు. అక్కడ మళ్ళీ జలయంత్రములక్రింద పాదప్రక్షాళన చేసికొని ముందునకు సాగిరి. కుడిప్రక్కగానున్న సీతమ్మవారి సర్వాభరణములను భద్రపరచినచోటుకు పోవుచున్నారు. రామదాసుగారు చేయుంచిన

సీతారామలక్ష్మణుల సర్వాభరణములను కనులారా, తనివితీర చూచుచున్నారు. అదిగో! భార్యభర్తను అడుగుచున్నది. స్వామీ! సీతమ్మవారికి, రాములవారికి లక్ష్మణునకు ఈ ఆభరణములను ఎవరుచేయుంచారు! దేవీ! సీతమ్మవారి ఈ పచ్చల పతకం, ఈ చింతాకుపతకం, ఈ మంగళసూత్రం, ఈ నవరత్నముల కంఠా హారము. రామలక్ష్మణుల హారములన్నియు భక్తాగ్రగణ్యుడగు రామదాసుగారు ఎన్నోలక్షలుపెట్టి చేయించారు. ఆహా! సీతారామ లక్ష్మణులకున్ని ఆభరణములను చేయుంచిఅమరజీవివైతివయ్యా రామదాసు. అవిగో! ఆ కన్పించెడివన్ని మన గవర్నమెంటువారు చేయుంచారు. అవికూడ కొన్నిలక్షల విలువగుతాయి. సీతారామ లక్ష్మణుల సర్వాభరణములను కనులార, తృప్తితీర దంపతులు తిలకించి పరవశులయిరి. దేవాలయ సంస్థవారు ముందుకు పదండని హెచ్చరిక చేయగా అక్కడనుండి ముందుకు కదలిరి. క్యూ ముం దుకు వేగముగా కదలి పోవుచున్నది.

భక్తులంతా క్యూలోనుండి చిత్రకూటం హాలులోనికిపోయిరి ఆ దంపతులుకూడ చిత్రకూటపు హాలులోనికి పోయిరి. అక్కడ అక్కన్న, మాదన్న చిత్రపటములను చూచుచున్నారు. ఆ చిత్ర పటములు ఎంతచక్కగా, ఎంతసైపుణ్యముతో గీయబడినవో దంపతులు తిలకించుచున్నారు. దేవీ! అటుచూడుము. శివధను ర్భంగదృశ్యము ఎంత చక్కగా చిత్రపటము గీచిరో! సీతాదేవి తలవంచుకొని రాములవారికి పూలదండ వేయుచున్నది. జనక

మహారాజుగారు క్రొత్తదంపతులైన సీతారాములను ఆశీర్వదించు చున్నాడు. అటుచూడు గుహుడు రాములవారిని తన పడవపై నది దాటించుచున్నాడు. ఆహా! ఆహా! ఆగుహునిభక్తి. అదృష్టము ఎంతని చెప్పుకొనవచ్చును. ధన్యుడవైతివి గుహుడా! ఆ తరు వాతచూడు బంగారులేడి సీతారాముల వద్దకువచ్చినది. సీతమ్మ వారు ఆ బంగారులేడిని చూచి మక్కువపడినది. బంగారులేడిని తెచ్చియిమ్మని అడుగుచున్నది కాబోలు. ఆ చిత్రపటంలోచూడు ఆంజనేయుడు సీతమ్మవారిని వెదకుటకై సప్తసముద్రములను దాటుచున్నాడు. జగజ్జనని సీతమ్మవారు లంకలో ఉండునేమో అని కాబోలు ఆకాశమార్గమున పోవుచున్నాడు. అటు చిత్రపటముచూడు ఆంజనేయుడు సీతమ్మవారిని కనుగొన్నాడు. శ్రీరాములవారిచ్చిన ఉంగరము సీతమ్మవారి కిచ్చుచున్నాడు. జననితో రామునిమాటలు ఏవో చెప్పుచున్నాడు. దానిప్రక్క చిత్రపటముచూడు రాములవారు సీతమ్మవారిని అపహరించిన రావణాసురునితో యుద్ధముచేయు చున్నాడు. రావణాసురుని తలలు ఒకదానివెంట ఒకటితెగి పడు చున్నవి. అటుప్రక్క చివరిచిత్ర పటముచూడు రాములవారికి పట్టాభిషేకము జరుగుచున్నది. ఆహా! ఈ చిత్రపటములలో జీవ కళలు ఉట్టిపడుచున్నవి. ఏమహాచిత్ర నిపుణులు ఇచ్చట చిత్రా లనుగీసిరోకదా! దేశములోని చిత్రపట కళాకౌశల్యము ఇచ్చటనే చూడవలయునుగదా! ఈ చిత్రపటములన్నియు క్రొత్తదంపతు లకు సంభ్రమాశ్చర్యములను కలుగజేసినవి.

అక్కడనుండి దంపతులు ముందుకు నడచిరి. మధ్యలో నున్న పాలరాతిలో చెక్కబడిన ఆంజనేయస్వామివారిని ఎంత చక్కగా చెక్కారోచూడు. ఈశిల్పమునకు జీవముపోసినట్లున్నారు లేకున్న ఇంతజీవకళ ఎక్కడిది. అరుగో! ఆంజనేయస్వామివారు మనవంకే చూచుచున్నట్లున్నారు. అని భర్తఅనెను. అక్కడనుండి ముందుకు నడచిరి. కుడిప్రక్కగా దేవాలయప్రధానాధికారి కార్యాలయము కన్పించుచున్నది. ఆఫీసులోని వారందఱు హడావిడిగా నున్నారు. ప్రధానాధికారి దేవకార్య కలాపములలో మునిగి యున్నారు. సహాయాధి కారులకు సలహాలనిచ్చు చున్నారు. అక్కడినుండి దంపతులు రామానుజ కూటములు దర్శించివచ్చిరి.

తరువాత పడమరగానున్న దేవాలయ సింహద్వారము వద్ధకు వచ్చిరి. భార్యాభర్తలిద్దరు ఒక ప్రక్క సింహద్వారమునకు చెక్కబడిన రామదాసుగారి విగ్రహమును తిలకించుచున్నారు. రామదాసుగారి విగ్రహము ఎంతచక్కగా చెక్కబడినదోచూడుము అంటున్నాడుభర్త ఆ రామదాసుగారు రామనామ సంకీర్తన చేసి కొనుచు ఎంతచక్కగానున్నాడో ఆహా! రామదాసా! ఆ చంద్రార్కచిరంజీవివై వర్థిల్లగలవయ్యా రామదాసులోని ఆదివ్యతేజస్సు, ఆమూర్తివైభవము ఎంతచక్కగా చెక్కబడినదో చూడుము. అటుప్రక్కచూడు దేవీ! భక్తకబీరుదాసుగారి విగ్రహము ఎంతచక్కగా చెక్కబడినదో. సితారుచిట్టితాళములను తీసి కొని తారకనామమును జపించుకొను చున్నాడు.

అటు ప్రక్కచూడుము దేవీ ! పొగడుచెట్టువంక రామదాసు గారివలె ఒక భక్తుడు రామనామము జపించుకొను చున్నాడు. అటుచూడు త్యాగయ్యగారి విగ్రహము ఎంత చక్కగా చెక్కారో ఆ త్యాగయగారు "రామానాపైదయజూడరా" అని పాడుకొను చున్నట్లున్నది. ఆహ ! త్యాగరాజా ! నీలోనిభక్తి. కవిత్వము, సంగీతము త్రివేణీ సంగమముగా కలసిపోయినవి. నీవుధన్యుడవై తివి త్యాగరాజా ! ఆ శ్రీరామచంద్రుని ప్రత్యక్ష మొనర్చుకొన్న వాడవునీవు ? భాగ్యమనగా నీదేస్వామి ? అదిగో ! అటుప్రక్క చూడు క్షేత్రయ్యగారి శిల్పము ఎంత చక్కబడినదో క్షేత్రయ్య గారు పదములను పాడుకొనుచున్నాడు. మఱియొకచోట అన్న మయ్యగారి శిల్పమెంత చెక్కబడినదో చూడుము. వీరు ముగ్వురు రాముని సేవించి, తరించిన సంగీత కళాపారంతులు కాబోలు ఆహా! ఈ శిల్పములలో కళానైపుణ్యము చూడుముదేవి! ఎంత చక్కగా చెక్కబడినవో! అజంతా, ఎల్లోరాశిల్పములను తలదన్ను నట్లుగా నున్నవి. ఏ మహాశిల్పులచే రామదాసుగారు ఈ శిల్పములన్నియు చెక్కింపచేసెనో కాని. ఆ శిల్పములన్నియు సజీవములై జీవకళ ఉట్టి పడుచున్నవి. ఈ నాటి శిల్పకళా వైభవమంతా ఈ భద్రాద్రి లోనే చూడవచ్చునట్లున్నది. ఇట్టి శిల్పకళావైభవమును నిర్మింప జేసి కైవల్య పదవిని పొందితివయ్యా రామదాసా! రామభక్తా గ్రగణ్యుడవయ్యా రామదాసా ! రామదాసుగారు ఎన్నిలక్షలుఖర్చు పెట్టి ఈ దేవాలయము, ఈ గాలిగోపురము, ఈ శిల్పములను

నిర్మింప జేసెనోకదా! అలనాడు ఆంధ్రభోజుడన బరగు శ్రీ కృష్ణ దేవరాయలనే కళావైపుణ్యములో మిగిలినావు.

ఆ దంపతులు దైవదర్శనము చేసికొని, అచ్చటి చిత్ర, శిల్పకళా నైపుణ్యముచూచి పడమర సింహద్వారముగుండా మెట్ల మీదుగా దిగివచ్చుచున్నారు. మెట్లమీదగా దిగి దేవాలయమునకు ఉత్తర భాగముగా మళ్ళిపోవుచున్నారు. ఆ ప్రక్క ఉత్తరసింహ ద్వారముపై విష్ణువును, శ్రీదేవి, భూదేవిని తిలకించుచున్నారు సింహద్వార తలుపుల జేగంటలు గణగణమని మ్రోగుచున్నవి. ఆ మ్రోతలు కర్ణానందముగానున్నది. దీని ఎదురుగా చూడుము దేవీ! మిధిలానగరద్వారము ఎంత చక్కగానున్నదో! ఆద్వార ఇరుప్రక్కల చూడుము. ఒక ప్రక్కగరుక్మంతులవారు, రెండవ ప్రక్క ఆంజనేయస్వామివారు ఉన్నారు. ఆ ప్రక్క నల్లరాతిపై ఏదోవ్రాసి యున్నదిచూడు. ఓహో! మిధిలానగరద్వార శంఖు స్థాపకులపేరా! ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖా మాత్యులు శ్రీరాజాసాగి సూర్యనారాయణరాజుగారి సమక్షమున ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారిచే 1-4-1974 తేదీన శంఖుస్థాపన చేయబడినది. ఇచ్చట మిధిలాన గరస్టేడియం నిర్మించెదరు భక్తులెల్లరు మిధిలానగర నిర్మాణము నకు విరివిగా విరాళము లివ్వవలయును కాబోలు.

అదిగో! అటుచూడుము దేవీ! ఆ ప్రక్క భద్రాచల మంతయు పెండ్లిపందిళ్ళువేసిరి. చక్కని అలంకారములు అలంక

రించిరి. భద్రాచలమంతయు వైకుంఠములా ప్రకాశించుచున్నది. అంతట సీతారాముల కళ్యాణ మహోత్సవము సందడించినది. పెండ్లి పందిళ్ళకు అరటిచెట్లనుకట్టిరి. ఆ చెట్లన్నియు ఫలభారము వంగి సీతారాముల కళ్యాణ మహోత్సవానికి వచ్చిన భక్తులను ఆహ్వానించు చున్నట్లుగా ఉన్నాయి. సీతారాముల కళ్యాణ మహో త్సవానికి వేంచేసిన భక్తులకు నమస్కరించుచునట్లుండెను. పరి ణతములగు అరటిపండ్ల సువాసనలు చాలదూరము ప్రాకుచున్నది. ఈ వాసనలు అందుకొని అప్పుడే రామచిలుకలు వాలుచున్నవి. భద్రాచలమంతయు మరకత మాణిక్య తోరణములతో అలంకరింప బడినవి. అవిగో! ఆ మరకత మాణిక్య తోరణములన్నియు రామ చిలుకల గుంపులుగా ప్రకాశించుచున్నవి.

పెండ్లిపందిరి అంతయు అత్యద్భుతరమణీయముగా అలంక రించబడినది. ఆణిముత్యముల సరములు. మరకత మాణిక్య తోరణములు, వింతలుగొలుపు కాంతుల నీనుచున్నవి. పెండ్లి పందిరి అంతయు చీనిచీనాంబరములతో. పరిమళ పుష్పాలంకారము లతో కన్నుల పండుగైనది. అందలి స్తంభములు రంభా కాండము లచే కొన్ని, శబలవర్ణ దీపములచే మఱికొన్ని. నానారుచులను వెదజల్లి, మందపవన చాలితములై భక్తులకు దీవెనలు చెప్పు చున్నట్లున్నవి. ఈ దృశ్యము అలౌకికమై స్వర్గవైకుంఠముల వలె ప్రకాశించుచున్నవి. అదిగో! పెండ్లి పందిరి అంతయు పన్నీటి జలముచే చల్లబడి ఘుమఘుమలాడు చున్నట్లున్నది.

మేలిమిబంగరు ధ్వజపటరిమలచే కప్పబడినది. శ్రీ చందన కుంకుమ రసములతో పూయబడినవి. పెండ్లిపందిరి అంతయు సువర్ణ దర్పణములు అమర్చబడ్డట్లుగా పాపలు కన్పడుచున్నవి. అని భర్త భార్యకు చూపుచుండెను.

అటుచూడుము దేవీ! సీతారాముల కళ్యాణమండపము ఎంత రమణీయముగా నున్నదో! ఆ మండపము ముందు పద్మ మునుచూడు. ఎంతచక్కగా గీయబడినదో! మండపమునకు ఇరు ప్రక్కల పాలరాతిలో చెక్కబడిన గజములు. ఆహా! ఎంత చక్కగాచెక్కబడినవి. జీవకళ ఉట్టి పడునట్లుగా నున్నవి. నల్లని ఏనుగులు, తెల్లనిదంతములు ఎంతచక్కగానున్నవి. మఱికొద్దిగా పైకిచూడుము. తెల్లని చిన్నఏనుగులు ఎంతచక్కగా చెక్కబడి నవో! అవిగో! మండపుమెట్లు ఆ మెట్లలోకూడ పాపలు కన్పించు చున్నవి.

అటుప్రక్కచూడు దేవీ! కళ్యాణమండపముపై రామదాసు గారి విగ్రహము ఎంతచక్కగా చెక్కబడినదో! అటుప్రక్క కబీరుదాసుగారి విగ్రహము ఎంతచక్కగా చెక్కబడినదో! దాని తరువాత తమ్మల (పోకల) దమ్మక్క సీతారాములను పూజించు చున్నది. ఆహా! ఈ ముగ్గురు భక్తులను ఎంతచక్కగా చెక్కి నారో చూడుము.

దాని తరువాతచూడుము దేవీ! దాశరథిని విశ్వామిత్రుడు యాగరక్షణార్థమై తీసికొని పోవుచుండెను. పాపమా దశరథ

మహారాజునకు శ్రీరామునిపైననే పంచప్రాణములు. అట్టిప్రాణ ప్రదుని యాగలక్షణార్థమై పంపుటకు దశరథ మహారాజుగారి మనస్సెంత బాధపడినదోకదా! శ్రీరాముడు, తాటకిని సంహరించి కౌశికియాగమును రక్షించెను. అడుగో! విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను తీసికొని మిథిలా నగరమునకు బయలుదేరెను. ఓహో! మిథిలా నగరములో సీతాస్వయంవరమని తెలిసినది కాబోలు. జనకమహారాజుగారు విశ్వామిత్రునకు ఎదురేగి తోడ్కొని పోయి ఉన్నతాసనముపై అలంకరింపజేసెను. అదిగో! అయ్యది యే సీతా స్వయంవరమన్నట్లున్నది. సీతా స్వయంవరమునకు ఖండ ఖండాంతరములనుండి రారాజులు సర్వాభరణ భూషితులై విచ్చేసిరి. వారంతా బంగారు గద్దెలపై బారులుతీర్చి కూర్చున్నారు వారిముందు కన్పిచెడిదే శివునివిల్లు సీతాదేవి మధూక మాలగైకొని ముద్దుల పెండ్లికూతురై తండ్రిప్రక్కన నిలబడిఉన్నది. పదునాల్గు లోకములను పాలించు శ్రీరామచంద్రుడు పెండ్లికుమారునివలె విశ్వామిత్రుని వెనుక నిలబడియున్నాడు.

జనకమహారాజుగారు సీతా స్వయంవరమునకు వచ్చిన రాజులందఱకు స్వాగతము పల్కుచున్నారు. మీ రాకచే నాదు గృహము పావనమైనది. ఆ శివుని విల్లు విరిశినవానిని నా ముద్దు కూతురు వరించునని చెప్పుచున్నాడు, కరతాళములు ఘనఘన మని మ్రోగుచున్నవి. సిగ్గుచేత తలవంచుకొన్న సీతమ్మవారిపై రాములవారి చూపులుపడినవి. సీతమ్మవారి మేనుపులకించినది.

ఎందరెందరో రాజులు కన్యనుపొందగోరి శివధనుస్సును ఎక్కు-పెట్టి పరాభవమునుచెందుతున్నారు. విశ్వామిత్రుడు రామునివంక చూచెను. రాముడు తనవిల్లు లక్ష్మణునకిచ్చి సీతను ఓరగంటితో చూచుచు, విశ్వామిత్రునకు నమస్కరించి సింహకిశోరమువలె ముందుకువచ్చెను. రాజులందఱు ఈ చిన్నవాడా! ఆ శివుని విల్లువిరిచేది అని ఆశ్చర్యపోవుచున్నారు. శ్రీరాముడు విల్లుపైచేయివేచెను. విల్లు పెళ్ళుమని విరిగినది. గంటలు ఘల్లుమని మ్రోగినవి. రాజుల గుండెలు ఝల్లుమనినవి. సీతమ్మవారి ఒల్లు ఝల్లుమన్నది. సిగ్గుచేత సీతమ్మవారేకాదు తలవంచుకొన్నది. సమస్తరాజకుమారులు తలలువంచుకొన్నారు. రాజులందఱు ఆహా ! పదిపదు నారేండ్లప్రాయమువాడా ! ఇంత పెద్దవిల్లు విరుచుటయా ! మనకు సిగ్గుసిగ్గని వెళ్ళిపోవుచున్నారు. సీతమ్మవారు శ్రీరాముని మెడలో మధూక మాలవేచెను. దేవతలంతా పూలవర్షమును కురిపించుచున్నారు. పార్వతీ పరమేశ్వరులుకూడ సీతారాముల కళ్యాణమునకు నంది వాహనముపై వచ్చి కూర్చున్నారు. లక్ష్మివంటి సీతతోపాటు విజయలక్ష్మిగూడ రామునకు గృహలక్ష్మియైనది.

అటుచూడు దేవీ ! మరికొన్ని దేవతా విగ్రములనుగూడ చెక్కిరి. ఆహా ! ఈ శిల్పకళానైపుణ్యము ఏమని కొనియాడగలము. అజంతా ఎల్లోరా శిల్పములను తలదన్నునట్లుగా మన్నవి. ఎంతచక్కనివాయి. ఎక్కడనుండి తెచ్చినారో కదా ! ఎందఱు మహాశిల్పులు, శిల్పాచార్యులు, శిల్పనైపుణ్యులు ఎన్ని సంవత్సరములు పనిచేసి ఈ కళ్యాణమంటపమును నిర్మించిరో కదా అందు

లకే 5 వందలమంది శిల్ప నిపుణులు 3 సంవత్సరములపాటు పని చేసి దీనిని నిర్మించిరని చెప్పెదరు. భారత దేశములోని శిల్ప నిపుణులందఱు ఇచ్చోటకేవచ్చి శిల్పములు చెక్కి ఉండెదరు. లేకున్న యింత శిల్పకళా నైపుణ్యమెట్లు వచ్చును.

అటుప్రక్కచూడుము దేవీ ! ఆ నల్లబాయిపై ఏదోవ్రాసి యున్నది. ఓహో! కళ్యాణమండప శంఖుస్థాపకుని పేరా ఆంధ్ర ప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిచే 30_5_1960 వ తేదీన శంఖుస్థాపన చేయబడి నది. దీనిఖర్చు 4 లక్షలు. అటుచూడుము. ఆంధ్రప్రదేశ్ శాసన సభా కాంగ్రెస్ నాయకులు డాక్టరు శ్రీ నీలం సంజీవరెడ్డిగారిచే 6—4—1964 వ తేదీన కళ్యాణ మండపము ఆవిష్కరింప బడినట్లున్నది.

అటుచూడు దేవీ కళ్యాణమండపమునకు తూర్పు ప్రక్కగా నాగవల్లి వృక్షముపూలు ఎంతచక్కగా విరబూసిఉన్నదో పూల వాసన గుబాళించికొడుచున్నది. సీతారాముల ఈ కళ్యాణ శుభసమ యంలో సుగంధ పరిమళాన్ని వెదజల్లుచున్నది. కాబోలు. అటు చూడుము. దక్షిణపు ప్రక్కగా (Air lines) వాయు తరంగ ములు సీతారాముల కళ్యాణ మంత్రములను దేశమంతటవినుపించు టకు సిద్ధముగా నున్నవి. అటు ప్రక్కనే ఆల్ఇండియా బ్రాడ్ కాస్ట్ప్రత్యక్ష వ్యాఖ్యానము చేసేడిది. అరుగో వారేప్రసిద్ధ వ్యాఖ్యా తలు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు శ్రీ యేల్చూరిపాటి

అనంతరామయ్యగారు. ఆ నవదంపతులిద్దరు కళ్యాణ మండప మంతయుచూచి, సీతారాముల కళ్యాణము చూచుటకై పందిరిలో కూర్చొనిరి. భక్తులంతా సీతారాముల కళ్యాణముచూచుటకై పందిరినిండిపోయిరి. ప్రజలంతా యిసుకవేసినా రాలనట్లున్నారు. వేలాదిగా రక్షకభటులుకూడ వచ్చిరి. అవిగో బాలభట సంఘ సమూహాములు బారులు తీర్చిఉన్నారు. భక్తులంతా సీతారాముల కళ్యాణ శుభసమయము దగ్గఱకువచ్చినదని సంతోషపడుచున్నారు.

అదిగో రాములవారు శంఖు, చక్ర, గదా, శార్ఙాయుధాలతో గజారూఢుడై సపరివారముగా దేవాలయమునుండి కళ్యాణ మండపమునకు వచ్చుచున్నారు. మిథిలానగర ద్వారమువద్దకు వచ్చిరి. పురోహితులు వింజామరలు వీచుచున్నారు. మంగళవాద్యములు దిక్కులు మారుమ్రోగునట్లుగా వాయించుచున్నారు. ఈ మంగళ వాద్యములు మూడులోకములలోని వారికి సీతారాముల కళ్యాణము జరుగుచున్నదని చెప్పకనే చెప్పినట్లుగా మ్రోగుచుండెను. భక్తులంతా స్వామివారి అడుగులకు మడుగులొత్తుచున్నారు. స్వామివారి రూపదర్శనముచే భక్తులంతా పరవశులగుచున్నారు. భక్తులెల్లరు సావధాన మనస్కులై రాములవారి దర్శనంచేసికొనుచున్నారు. రాములవారు మిథిలానగర ద్వారముదాటి గజారూఢుడై కళ్యాణ మండపమువద్దకు తానేవచ్చిరి. ప్రజలంతా కోలాహలంగా స్వామివారిని తిలకించుచున్నారు. ప్రజలంతా జనకమహారాజుగారు ఎదురుకోల సన్నాహము జరిపి, సమస్త గౌరవ లాంఛనములతో

ఆహ్వానించినట్లుగా ప్రజలు రాముల వారిని తోడితెచ్చి కళ్యాణ మండపములో సువర్ణమణిమయ పీఠముపై కూర్చొనబెట్టిరి స్వామివారి పాదస్పర్శచేతనే కళ్యాణమండపము కాంతులు ద్విగుణీకృతమయ్యెను.

అరుగో అష్టదిక్పాలవలెనున్న పురోహితులు సీతారాములను తూర్పుముఖముగా పెండ్లిపీటలపై కూర్చొనబెట్టిరి. ఒకప్రక్క పురోహితులు "శుక్లాంబర ధరవిష్ణు" అని వేదోక్తంగా మంత్రములు చదువుచున్నారు. ఒకప్రక్క మంగళవాద్యములు ప్రయోగించుచున్నారు. ఒకప్రక్క భక్తులంతా సీతారాముల కళ్యాణము చూడవలయునని ఉవ్విళ్ళూరు చున్నారు, పందిళ్ళంతట పిండి ఆరబోసినట్లుగా ప్రజలు నిండిపోయిరి. అటుప్రక్కనే సహజ సౌందర్యవతియైన సీతమ్మవారు సర్వాభరణ భూషితమై శోభాయమానముగా ప్రకాశించుచున్నది. సీతమ్మవారు సిగ్గుచేత తలవంచుకొన్నది. ముత్తైదులంతా సీతరాముల పెండ్లిపాటలు పాడుచున్నారు జగత్కళ్యాణార్థమై జరుగుచున్న సీతారాములకు సర్వాభరణములను తెచ్చినాడా అన్నట్లుగా సూర్యుడకూడ దగ్గఱకు వచ్చెను. వాయువుకూడ అనుకూలముగానే వీచుచున్నది. పంచభూతములు కూడ అనుకూల పరిస్థితులోనే ఉన్నవి. భక్తులంతా ఏకైకలక్ష్యంగా సీతారాములను తిలకించుచున్నారు. అరుగో భక్తులంతా "రామయ, రామభద్రాయ, సీతాయ" అంటున్నారు. భక్తులంతా స్వామివారిని వేయికళ్ళతో తిలకించుచున్నారు. కళ్యాణ మండపమంతా వైకుంఠములా ప్రకాశించుచున్నది. సర్వవేదవేదాంగ విధులు, వేదవిదారుసులు సీతారాముల మెడలలో పూలదండలు ఉంచుచున్నాంత

సీతమ్మవారిప్పుడు అతిలోక సుందరిగా ప్రకాశించుచున్నది. లోక కళ్యాణం జరుగుచున్నది. సుగంధ ద్రవ్యములు పూయుచున్నారు. తులసీగంధం వ్యాపించుచున్నది. సీతమ్మవారిప్పుడు ఏడువారముల సొమ్ములను ధరించి విజయలక్ష్మివలె ప్రకాశించుచున్నది.

అష్టఋషులవలెనున్న పురోహితులచే వేదోక్తంగా మంత్రములు చదువబడుచున్నవి. శాస్త్రప్రకారం కళ్యాణం చేయుంచుచున్నారు. విష్వక్సేనుని పూజజరుగుచున్నది. వేదమంత్రములు పఠించుచున్నారు. వేదంపుణ్యగోదావరి ప్రవహించినట్లుగా ప్రవహించుచున్నది. వేదఘోషకు పరిసర ప్రాంతమంతయు పునీతమైనది. సీతారాములకు బొట్టుపెట్టుచోటున గంటలుకూడ కన్పించుచున్నవి. అనగా పూర్వకాలము నుండియు ఈ సీతారాముల విగ్రహములున్నట్లుగా నిదర్శనమివియే. గవర్నమెంటువారి ఆజ్ఞానుసారముగా అలనాడు జనకమహారాజుగారు మిథిలా నగరములో కన్యాదానము చేసిన పద్ధతిలోనే సీతారాముల కళ్యాణము చేయుచుండిరి. అటులనే జనకమహారాజుగారు దశరథ మహారాజుగారి సమక్షములోనే జరిగినట్లుగానే జరుగుచున్నది. అందులకే కాపోలు కళ్యాణ మండపముపై జనకమహారాజుగారు కన్యాదానము చేసినట్లుగా శిల్పము చెక్కబడినది.

అటుప్రక్క పురోహితులు వేదమంత్రములు చదువుచున్నారు. కోలాహలం మిన్నంటుచున్నది. వేదఘోష దశదిశలు ప్రతిధ్వనించు చున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిఇంటిలోను సీతారాముల కళ్యాణము జరుగుచున్నట్లుగా ప్రతిఇంటి రేడియోలో మంత్రములు వినబడుచున్నవి. మన భారతదేశంలో ఒక్క సీతా

రాములకే ఈ విధంగా బ్రహ్మాండముగా కళ్యాణ మహోత్సవము జరగడము. దానివిశిష్టత ఏమిటంటె రాముడు ఏకపత్నీ వ్రతుడు. అతనిది ఒకేమాట ఒకేబాణము. ఇందువలన రాములవారికి ఒక్క రితా ఈ విధంగా కళ్యాణ మహోత్సవము జరుగుచున్నది. ఈ కళ్యాణ మండపముపై ఒక సుదర్శనమూర్తి ఉన్నాడు రామదాసు గారు కట్టించిన దేవాలయముపై ఒక సుదర్శనమూర్తి కలదు. ఇవియొక గొప్ప విశేషములు.

అష్టర్షులవలెనున్న పురోహితులచే విష్వక్సేనారాధన చేయ బడుచున్నది. అవిగో ! ధర్మకర్తల అధ్యక్షులవారి ఎగ్జిక్యూటిన్ ఆఫీసరుగారి, తదితర పెద్దలగోత్ర నామములతో మంత్రములు చెప్పబడుచున్నవి. ఈ సంవత్సరము దేవాదాయ ధర్మాదాయశాఖ వారు సీతారాములకు మంచిముత్యాలను, తలంబ్రాలను తెచ్చిరి. అదుగో ! భక్తులంతా కనుచూపుమేరకు నిండిపోయిరి. భక్తులంతా కళ్యాణ మంత్రములను శ్రవణానందముగా వింటున్నారు. విష్వక్సేనపూజ పూర్తిఅయినది. జగత్కళ్యాణము కొఱకు ఈ సీతారాముల కళ్యాణం జరుగుచున్నది. పూర్ణాహుతులు ఇచ్చుచున్నారు. కళ్యాణ సంకల్పం చదువబడుచున్నది. దశదిశము భక్తులు నిండి పోయిరి. అరుగో ! లక్షలాది భక్తులు సీతారాముల కళ్యాణం ప్రశాంతముగా తిలకించుచున్నారు. ఆ బాలగోపాలము నేత్రోత్సవముగా చూచుచున్నారు. ఆనంద పారవంశములతో తిలకించు చున్నారు. పురోహితులు జేగంటలు మ్రోగించుచున్నారు. సీతారాములను ఎదురెదురుగా కూర్చొనబెట్టిరి. సీతారాములకు సర్వాభరణములను అలంకరింపజేసిరి. వేదఘోషనాల్గు దిక్కుల

ప్రతిధ్వనించుచున్నది. గాయిత్రీ మంత్రములు చదువబడు చున్నవి. సీతమ్మవారిప్పుడు ఏడువారముల సొమ్ములను ధరించి అపరలక్ష్మిదేవివలె ప్రకాశించుచున్నది. ఆహా! సీతమ్మవారి కంఠ హారము ఎంతబాగున్నది. ధగద్ధగాయమానముగా ప్రకాశించు చున్నది. ఆ రామదాసుగారు ఎన్నివేలుపెట్టి ఈ కంఠహారము చేయించారోగదా! ఆ పచ్చలపతకం ఆ చింతాకుపతకం, ఆ ఉంగరం ఆ తమలపాకు, ఆ రామసోదరుల ఆభరణములు ఇవన్నియు విన్ని వేలుపెట్టి చేయించి ఉండునోకదా! రాములవారు సర్వాభరణములను ధరించి, సాక్షాత్తు విష్ణుమూర్తివలె ప్రకాశించుచున్నాడు. ఇప్పుడు సీతారాములు సాక్షాత్తు లక్ష్మినారాయణులవలె ప్రకాశించుచున్నారు.

సీతమ్మవారు తెల్లని పట్టుచీరను ధరించి విజయలక్ష్మివలె ప్రకాశించుచున్నది. రాములవారిచే సీతమ్మవారికి పూలమాలను వేయించిరి. మంగళవాధ్యములు మ్రోగుచున్నవి. సీతరాములకు సుగంధద్రవ్యములు పూయబడిఉన్నవి. పురోహితులచే మంత్ర ములు చదువబడుచున్నవి. పురోహితులు ఎఱ్ఱని పట్టుచీరను సీతా రాముల మధ్య పెట్టిరి. అయోధ్యారాముడు, జగదభిరాముడు, కోదండరాముడు. రామచంద్రుడు. రాములవారిచేత సీతమ్మవారి హస్తమును తాకించుచున్నారు. రాముని చేతిస్పర్శవలన సీతమ్మ హస్తాంబుజము వికసించినట్లయినది. సీతమ్మవారి హస్తస్పర్శచే రామునికి హస్తము అతిప్రకాశవంతముగా వెలుగు చున్నది. పురోహితులు సీతారాములవారి హస్తములకు సువర్ణ కంకణములు ధరింపజేయుచున్నారు. వేదోక్తమైన మంత్రములతో సీతారాము లను దీక్షాపరులనుగా జేయుచున్నారు. మధుపర్కం పెట్టుచున్నారు

సువర్ణయజ్ఞోపవీత ధారణ జరుపబడుచున్నది. సీతమ్మవారి చూపులు రాములవారిపై పడినట్లున్నవి. రాములవారి చూపులు సీతమ్మవారిపై బడినవి. ఇప్పుడే సీతారాములచూపులు కలిసెను. భక్తులంతా వేయికళ్ళతో తిలకించు చున్నారు. వధువు యజ్ఞోప వీత ధారణ జరుగుచున్నది. పవిత్రమైన మంగళసూత్రం భక్తులకు చూపుచున్నారు. పురోహితులు జేగంటలు మ్రోగించుచున్నారు అటుప్రక్క ముత్తైదువులు సీతారాముల పెండ్లిపాటలు పాడుచు న్నారు. సువర్ణయజ్ఞోపవీతధారణ పూర్తిఅయినది. అనగా సీతమ్మవారిప్పుడు పెండ్లిచేసికొనుటకు అర్హత కలిగియున్నదన్న మాట. ఆదుగో! సీతారాములు దివ్యతేజస్సుతో ప్రకాశించు చున్నారు.

రమణీయమైన, కమనీయమైన సువర్ణయజ్ఞోపవీతధారణ జరిపిరి. ఆహా! జనకమహారాజుగారి భాగ్యమేమని కొనియాడ గలము. జగదేకమాత, లోకమాతను కన్నాడ. సాక్షాత్తుగా లక్ష్మి నారాయణునే అల్లునిగా బడసినాడు. జనకమహారాజుగారు కన్యా దానము చేయుటకు సిద్ధముగానున్నారు. వివాహము లౌకికముగానే జరుగుచున్నది. అష్టఋషులవలెనున్న పురోహితులు వేదోక్తముగా మంత్రములు పఠించుచున్నారు. లోకమాతా పితరులకు కళ్యాణము జరుగుచున్నది. జనకమహారాజుగారు సర్వాభరణములను సువర్ణ పాత్రలోపెట్టి రాములవారికిచ్చుచున్నారు. మధుపర్కం జరుగు చున్నది. బంగారు పళ్ళెరములోపెట్టి నూతన వస్త్రములను సమ ర్పించుచున్నారు. రాములవారు నూతన వస్త్రములను ధరించి విష్ణు మూర్తివలె ప్రకాశించుచున్నారు. దశరథ మహారాజుగారు అటు

ప్రక్కనున్న తాసనముపై కూర్చొనెను. భక్తులంతా ఇతోధికంగా వారివారి శక్తికొలది సీతారాములకు కానుకలు సమర్పించు చున్నారు. పెండ్లిపీటలమీద కూర్చొన సీతారాములు సాక్షాత్తు లక్ష్మీ నారాయణులవలె ప్రకాశించుచున్నారు. శుభనక్షత్రమందు పాణీ గ్రహణము జరుగబడుచున్నది. వధూవరులకు సుగంధ ద్రవ్యము లను సమర్పించుచున్నారు. వధూవరులు ఒకరినొకరు చూచుకొను చున్నారు. భక్తులంతా వేయికళ్ళతో సీతారాముల కళ్యాణం తిల కించుచున్నారు. జనకమహారాజుగారు సీతమ్మవారిని కన్యాదానం చేయుచున్నారు. వేదఘోష ప్రతిధ్వనించుచున్నది. భక్తులంతా పిండి ఆరబోసినట్లుగా భద్రాచలమంతయు నిండిపోయిరి. రక్షక భటులుకూడ సీతారాముల కళ్యాణముచూచి పరవశులగుచున్నారు. ఒక రక్షకభటుడు తనచేతిలోనుండు బెత్తము జారిపోయినను గమ నించలేకపోయెను. మఱియొక రక్షకభటుడు తలమీద టోపికూడ జారిపోయినది తెలియక తన్మయుడగుచున్నాడు. స్కౌట్ సమూహములు బారులుతీర్చిఉన్నవి. నాల్గులక్షల ప్రజలు దేశదేశ ములనుండి, గ్రామగ్రామములనుండి సీతారాముల కళ్యాణము చూచుటకు వచ్చిరి. గోదావరీనదీమ తల్లికూడ సీతారాముల కళ్యా ణము చూచుచు పోవుచున్నట్లున్నది. అందులకే చాలప్రశాంతముగా నడచుచున్నది.

అదుగో! నాల్గులక్షలమంది భక్తులు జగత్కళ్యాణార్థమై జరుగుచున్న సీతారాముల కళ్యాముసకై వేయికళ్ళతో ఎదురెదురు చూచుచున్నారు. భక్తులంతా స్వామివారికి కానుకలు సమర్పించు చున్నారు. ఈ సంవత్సరం సీతారాములకు కానుకలు విరివిగావచ్చి నవి అదిగో! అటుప్రక్క జనకమహారాజుగారి మంగళసూత్రం

ఇటుప్రక్క రామదాసుగారి మంగసూత్రం పురోహితులు ప్రజలకు చూపుతున్నారు. ప్రజలంతా వేయికళ్ళతో తిలకించుచున్నారు. ఇప్పుడు మంగళసూత్ర ధారణ జరగబోవుచున్నది. సీతమ్మవారు సిగ్గుచేత తలవంచుకొనుకొనుచున్నది. సీతమ్మవారు ఆమెమెడలోని హారముతో రాములవారిని, సమస్తకళ్యాణ వైభవమును చూచు కొనుచు న్నట్లున్నది. రాములవారు హారములలో వివిధరంగులలో కన్పించుచున్నారు. ఈ దృశ్యం సీతమ్మవారికి ఆశ్చర్యంము కలిగించుచున్నది. సీతమ్మవారి శంఖమువంటి కంఠమునకు రాములవారు మంగళసూత్రమును మూడుముడులు వేయుచున్నారు. లక్షలాది ప్రజలు కన్నుఆర్పకుండగా కళ్యాణవైభవము తిలకించుచున్నారు. ఒకభక్తురాలు ప్రతిసంవత్సరము సీతారాములకు లక్ష మల్లెలు సమర్పించుచున్నది. ఈ సంవత్సరముకూడ లక్ష మల్లెలు సమర్పించుచున్నది. మంగళసూత్ర ధారణ జరిగినది. సీతారాములిప్పుడు అపర లక్ష్మీనారాయణులవలె ప్రకాశించుచున్నారు. సీతారాములపై కనక వర్షము కురిపించినట్లుగా అక్షతలు చల్లుచున్నారు. సీతమ్మవారిపైబడ్డ అక్షతలు బంగారు కాంతులనీనుచున్నవి. రాములవారిపైబడ్డ అక్షతలు నీలమేఘచ్ఛాయ వర్ణములతో ప్రకాశించుచున్నవి. భక్తులంతా అ అక్షతల మార్పులనుజూచి దిగ్భ్రాంతులై తిలకించుచున్నారు చల్లినవన్నియు ముత్యాల అక్షతులైనప్పటికిని సీతారాములపైబడి ,ఆయావర్ణముల అక్షతలుగా మారినవి. సీతారాములముందు ఏనుగు దంతములవలె కళ్యాణ మండప స్థంభములు కన్పించుచున్నవి. సుందరములైన, రకరకములైన పూలగుత్తులు వెల్లివిరిసిఉన్నాయి సీతమ్మవారు పూలమాలలలో నిండిపోయినదీ. సీతమ్మవారు పూలమాలల చాటునుండి రాముల

వారిని తొంగిచూచు చున్నట్లున్నది. అరటిచెట్లు బారులుతీర్చి ఉన్నాయి. అవిగో! పూర్ణ కుంభములు. సీతారాముల ముందు మంచి ముత్యాల తలంబ్రాలు.

ముత్తైదువులు సీతమ్మవారిచేత చేతులెత్తించి రాములవారిపై ముత్యాల అక్షతలు పోయించుచున్నారు. సీతమ్మవారు ఎఱ్ఱని దోసిటతో తెల్లని ముత్యాల తలంబ్రాలు దీసినది. సీతమ్మవారు తీసిన ముత్యాల తలంబ్రాలు సీతమ్మవారి దోసిలిరంగులో ఇంపుగా కెంపులయినాయి. సీతమ్మవారు ఆ కెంపులను రాములవారిపై పోయుచున్నది. రాములవారి నీలమేఘచ్ఛాయ తగులగానే నీలాలయ్యెను సీతమ్మవారు ఇన్నిరంగుల తలంబ్రాలనుజూచి తెలతెలబోవుచున్నది. శ్రీరాముడు తెల్లని ముత్యాల తలంబ్రాలు దోసిలితో తీయగా నీలమేఘచ్ఛాయలయ్యెను. ఆ తలంబ్రాలు సీతమ్మవారిపై పోయగా సీతమ్మవారి బంగారుచ్ఛాయ తగులగానే బంగారు అక్షతులైనవి. అరుగో! సీతారాములే సంభ్రమాశ్చర్యములతో చూచుకొనుచున్నారు. అరుగో! పురోహితులు అక్షతలను భక్తులకు పంచిపెడుచున్నాడు. భక్తులంతా ఆ అక్షతలను భద్రముగా మూటకట్టున్నారు. ఇళ్ళకు తీసికొనిపోయి సీతారాముల ఆశీస్సులనుపొందుటకుకాబోలు! పురోహితులు జేగంటలు మ్రోగించుచున్నారు. నీరాజనములను సమర్పించుచున్నారు. భక్తులంతా భద్రాద్రి సీతారాముల కళ్యాణము చూచుటవలన ధన్యులమయ్యామను కొనుచున్నారు.

ఈ భద్రాద్రి సీతారాముల కళ్యాణము చూచినవారికిని, చదివినవారికిని, వినినవారికిని ఆ భద్రాద్రి సీతారాములు ఆయురారోగ్యభోగభాగ్యములనిచ్చి కాపాడుగాక! యని ప్రార్థించుచున్నాను.

సర్వేజనా స్సుఖినోభవన్తు

# రచయిత వంశ వృక్షము.



రామయ్య (భార్య) మహాలక్షమ్మ
వెంకటసుబ్బయ్య
చింపిరయ్య
(భార్య) వెంకాయమ్మ
చిట్టెమ్మ
రంగమ్మ
శేషయ్య
ఆదెమ్మ
అప్పయ్య
(భార్య) అన్నపూర్ణమ్మ
(సీతారామమ్మ)
శేషగిరిరావు
రంగారావు
(భార్య) రామతులశమ్మ
(వెంకట్రావు)
కామేశ్వరమ్మ
శివరామకృష్ణ
రాధాకృష్ణ